# శారదాపద్య వాచకములు

(ఏడవ వాచకము.)

గ్రంథకర్త:

తేకుమళ్ల రాజగోపాలరావు.






[రెండవ కూర్పు.)

1930



Price 8 As.] [వెల 8 అణాలు.

# కృతి సమర్పణము.

ఓమ్

పట్టిన పట్టువిడువక సాధించు దిట్టయై బ్రహ్మసృష్టికిఁ
ప్రతిసృష్టిగావించిన కౌశికమునీంద్రుని వంగడ
మునఁబుట్టి శ్రీరామచంద్రమూర్తిని
అయోధ్య కొసఁగిన తల్లికి
కళలఁబోషించుచు భాగ్యమును హెచ్చించుచు విజ్ఞాన-
మును వెదఁజల్లుచు నఖండప్రభతో భరత
వర్షమునంతను నేకచ్ఛత్రముగా
నేలిన తల్లికి
ఆసియా, ఐరోపా మున్నగు పంచమహాభూఖండములకు
జ్ఞానభిక్షనొసఁగి యుద్ధరించిన సిద్ధనాగార్జున
దిజ్ఞాగాది విశ్వాదర్శకులఁగన్న తల్లికి
మాతల్లికి

## ఆంధ్రభాషామతల్లికి

నేఁటి తనబిడ్డలయభ్యుదయమునకై యీశారదావాచకములను
వినయముతో, భక్తితో
సమర్పించుకొనుచున్నాను.

శ్రీ శ్రీ శ్రీ

**తేకుమల్ల రాజగోపాలరావు.**

# విషయసూచిక.

విషయము. పుట.

శ్లో. నిరీశ్వరాః పరే దేశాః
ఆంధ్రస్త్వేకోఽస్తి సేశ్వరః,
యత్రాఽస్తే భగవా న్విష్ణు
రాంధ్రనాయకసంజ్ఞయా.

ప్రాచీనము.

# భారతవర్షవిశేషములు.

భీష్మపర్వము—౧-వ ఆశ్వాసము.

వారి నన నేల తొల్లియు వసుధ కై య
నేకనృపతులు పోరాడి రిట్లు నేల
వాలి కాదె భగీరథ రఘుయయాతి
నహుషముఖ్యులు విశ్రుతోన్నతులు గనిరి. 1

భారతవర్షమండలి యుదార విభూతి విలాసంబున కాస
పడి యెట్టివారును నీసునం బెనంగ కుందురె. దీనివిస్తారంబు
నేను వివరించెద. 2

మలయ మనఁగ శుక్తి మంతంబు నా వింధ్య
మనఁగఁ బారియాత్ర మన మహేంద్ర
మనఁగ ఋక్షవంత మన సహ్య మన నిందుఁ
గులనగంబు లేడు వొలుచు నధిప. 3

అనియందు వివిధమణిగణంబులు సమకూర్పవచ్చు నసిన
ఖని విశేషంబులు సెప్ప నేల? మఱియు నుపమహీధరంబు
లనేకంబులు గలిగియుండు వానియందు. 4

ఇనుమును రాగియుఁ దగరం
బును వెండియుఁ బసిఁడియుం బ్రభూతము లై పే
ర్చిన సిరిఁ జేయఁగ నొప్పెడు
ఖను లెడనెడఁ బెక్కు గలవు కౌరవనాథా! 5

క. వెండియు ధనార్జనంబును
గొండలవలనను ఘటించు ◊ కొననగు నేర్పుం
దండితనంబును బాడియు
నొండొంటికి మిగులఁ గలిగి◊యున్న ట్లయినన్. 6

వ. గంగయుఁ దుంగభద్రయు వేత్రవతియు వేగవతియుఁ గృష్ణ
వేణియుఁ బెన్నయు యమునయుఁ దమసయు శరావతియుఁ
గావేరియు గోదావరియు నర్మదయు బాహుదయు సరయు
వును శతద్రువును వితస్తయు విపాశయుఁ దామ్రపర్ణియు
నను మహానదులు మఱియు ననేకసరిద్విశేషంబులునుం గలి
వీనివలన నానాముఖంబుల ధనధాన్యాది సంపదాగమం
బులు సొంపు మిగిలి యుండు.

క. ఎడనెడఁ బఱపై యొప్పెడి
యడవు లనేకములు వానిఁ◊యం దర్థము సే
రెడివెఱవులు పెక్కులు చొ
ప్పడియుండు నయంబుతోడి ◊ బలిమి గలిగినన్.

వ. ఆంధ్రసింధుచోళాద్యనేక జనపదంబు లీ (భారతవర్షంబున
సమస్త వస్తు సంపత్సంపాదనంబు లయిన గుణవిశేష
బుల వెలసి పురుషార్థంబులకు ధర్మార్థకామములకుం గా
ణంబు లై కమనీయంబు లగు చుండు.

క. వినికిఁ గలిగి రక్షించుచు
ననువున దయతోడి పాడి ◊ నాయతు లెల్లం
గొనుచుఁ దగ నేలి పొగ డొం
దిన రాజున కుర్వి కామ◊ధేనువు కాదే ? 1

---

# ఆంధ్రులు.



యయాతికొడుకనువునకు సభానరుండుఁ జక్షువుఁ బరోక్షుండు ననువారు మువ్వురు పుట్టిరి. అందు సభానరునకుఁ గాలనాథుండుఁ గాలనాథునకు సృంజయుండు సృంజయునకుఁ బురంజయుండుఁ బురంజయునకు జనమేజయుండు జనమేజయునకు మహాశాలుండు మహాశాలునకు మహామనసుండు మహామనసునకు నుశీనరుండుఁ దితిక్షువు నన నిరువురు జన్మించిరి. అందుఁ దితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు సుతపునకు బలియుఁ బుట్టిరి. ఆబలివలన నంగవంగకళింగ సింహపుండ్రాంధ్రులను పేళ్లుగలవా రార్వురు కుమారులు పుట్టిరి. వారలు తూర్పుదేశంబులకు రాజులయి యాదేశంబుల్లకుఁ దమతమ నామధేయంబు లిడి యేలిరి.

—భాగవతము : నవమస్కంధము.

# మన భాష.

ఆ. తెలుఁగ దేల యన్న దేశంబు తెలుఁగేను
దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

—కృష్ణదేవరాయలు.

ఆ. జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలు గాదె?

—క్రీడాభిరామము.

ఉ. అచ్చతెలుంగు పద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందురది యెన్నదుఁ బెద్దలు! పొత్తమెల్ల ని
ట్లచ్చ తెలుంగునన్నుడువ నందుల చందమెఱుంగువారు ని
మ్మెచ్చరొ యబ్బురంబనరొ మేలనరో కొనియాడరో కడున్.

—పొన్నికంటి తెలగన్న, యయాతిచరిత్రము.

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

—నన్నెచోడుఁడు, కుమారసంభవము.

ద్వి॥ అరూఢగద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు.

—పండితారాధ్య చరిత్రము.

ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగునుజానుఁదెనుంగు.

—బసవపురాణము.

---

# పరమేశ్వరుఁ డాంధ్రదేశమున స్థిరనివాస మేర్పఱచుకొనుట.

వ. సూర్యుండును నీశ్వరుని గౌరీవినాయకులను బరిజనంబుల నెల్లరను నాశ్రయించి వారి యనుగ్రహప్రసాదంబులు వడసి పరమేశ్వరుం దరిసి. 1

తే. బ్రహ్మవిష్ణుమహేంద్రాది పరివృఢునకు
నద్రిరాజకన్యకన్యాస మన్వితునకుఁ
బ్రమథగణభూత భేతాళపరివృతునకు
హరున కినుఁడు నమస్కార మాచరించె 2

వ. ఇట్లు ప్రణామానంతరంబున భాస్వంతుండు గౌరీకాంతునకు నిజాగమనప్రయోజనం బెఱింగించి యాంధ్రదేశంబున కాహ్వానించుటయు. 3

ఆ. ఇనునితోడిచెలిమి । నిభరాజవదనుండు
విన్నపంబుచేసె । విశ్వపతికి
నమృతమథనవేళ । నావిర్భవుండైన
భుజగహారుఁ జూడఁ । బోద మనుచు. 4

సీ. విఘ్నాధినాథుండు । విన్నవించిన మీఁదఁ
బర్వతాత్మజ విన్నపంబు చేసెఁ
బర్వతాత్మజ విన్నపం బొనరించిన
వెనుకఁ గ్రౌంచఘ్నుండు । విన్నవించెఁ
గ్రౌంచఘ్నుఁ డిటు విన్నవించిన యత్తఱి
మఱి విన్నవించెను । మాతృగణము
బ్రహ్మ్యాదిమాతృవర్గము విన్నవించిన
వెంబడి భూతముల్ । విన్నవించె
తే. నిందుధరునకుఁ గైలాసమందిరునకు
నభవ! విచ్చేయు రవికిఁ బ్రియంబు గాఁగ
నమృతవారాశి నుదయించి । యాంధ్రభూమి
దక్షపురి నున్నయాదివ్యతనువుఁ జూడ.

వ. అని యిట్లు విన్నవించిన విఘ్నేశ్వరుని మీఁదియనుగ్రహం
బునను భవానిమీఁదికూర్మిని గుమారునిమీఁది ప్రేమా
నుబంధంబునను బ్రాహ్మ్యాది మాతృగణంబులమీఁదిప్రీతిని
భూతంబులమీఁది యాదరాతిశయంబునను భాస్వంతుని
మీఁదిసంతోషంబునను మధ్యమలోకగమనోద్యుక్తుం డై
హరివిరించులం జూచి మహాదేవుం డిట్లనియె.

మ. కలవారందఱు దక్షవాటిగమనోత్కంఠాసముత్సాహదో
హలులైనారు సహస్రభానుఁడును నభ్యర్థించుచున్నాఁడుమఁ

గళదివ్యామృతలింగ దర్శనమునున్ గర్తవ్య మంత్రక్షమా
స్థలికిం బోదమె యాసుపోకకు వినోదంబుల్ పరీక్షింపఁగన్.

తే. పాయ కొలకచోటఁ జదికిలఁ బడఁగ నుండ
నైనఫల మేమి యాటువినోదార్థ మరిగి
సంచరింతముగాక యా జలజహితుని
ధర్మ మార్జిత్యమును బొంద దక్షపురిని. 8

వ. అని యానతిచ్చి యాక్షణంబ. 9

క. చాటింపఁ బంచెఁ జంద్రక
రీటుఁడు కైలాసనగపురీవీథుల ఘం
టాటంకృతితో దక్షుని
వాటికిఁ బయనంబు ప్రమథవరులకు ననుచున్. 10

వ. అప్పుడు భవాని భవుసన్నిధిఁ జేతులు మొగిచి యిట్లని
విన్నవించె. 11

తే. పుట్టినిలు గాన నాకు నెప్పుడును ప్రేమ
దక్షవాటికమీఁద నెంతయు ఘనంబు
సన్నిధానంబు సేయు మోహచంద్రమౌళి!
యమ్మహాపురి భీమలింగమ్ము మీఁద. 12

తే. ఉత్తరంబునఁ గాశీపురోత్తమంబు
మోక్షలక్ష్మికి నెబ్భంగి మూల మయ్యె
దక్షిణంబున నాభంగి దక్షవాటి
మూల మౌఁగావుతను భోగమోక్షములకు. 13

తే. కుంటికుదుపు లశక్తులు కుష్ఠరోగు
లంధులును వృద్ధులును బాలు రాదిగాఁగ

గాశి కరుగంగ లేనివి కారు లెల్ల
మోక్షమును బొందుదురుగాక దక్షవాటి. 14

మ. కలిదోషంబుననిష్ఠురాత్మకులునుఁ గామాంధులుం బాపక
ర్ములు నజ్ఞానదవాగ్నిదగ్ధులును నై ప్రోద్యన్మహారౌరవా
వలిఁ గూలంగలదుష్టమానసులకున్ వారాణసీతుల్యమై
గలుగుంగావుత ముక్తి దక్షపురి నీకారుణ్యసంభావనన్. 15

తే. సర్వలోకంబులకును మోక్షదుఁడ వైన
నీవు సన్నిహితుండ వై నిల్చినపుడు
దక్షిణాపథకాశి శ్రీదక్షవాటి
భువనమాన్యంబ కద నాకుఁ బుట్టినిల్లు. 16

వ. అని విన్నవించినయనంతరంబ యంబికావల్లభుండు, కైలాస
భవనంబుననుండి సకలపరివారసమేతుం డై దక్షారామంబు
ప్రవేశించిన. 17

శా. సంతోషించిరి దక్షిణాపథజనుల్ సాక్షాద్విరూపాక్షుని
గాంతాసంయుతు నందివాహు శశిశేఖరజూటకోటీరు వే
దాంతాభ్యర్చిత పాదపంకజుని దక్షారామమధ్యంబునం
దంతస్సంభృతసౌఖ్యుఁ గంటిమి దెకన్నారంగ నంచెంతయున్.

తే. అని సమస్తజనంబులు నభినుతింప
నల్లనల్లన వేంచేసె నంధకారి
దక్షవాటికఘంటాపథంబునందు
హరిశతానందశక్రాదిసురలు గొలువ. 19

వ. ఇట్లు భీమేశ్వరసదనాంతరంబుం బ్రవేశించి. 20

తే. గారవించెను విధి శిరఃకంపమునను
నాదరించెఁ బ్రియోక్తుల నబ్జనాభు

ఇంచుమందస్మితమున మహిన్నించె శక్రు
హరుఁడు గరుణించె సురలఁ గటాక్షదృష్టి. 21

చ. సకలదిశాముఖంబులు ప్రసన్నములయ్యెఁ బ్రదక్షిణార్చియై
యకలుషలీలఁగైకొని యెహవ్యవహుండు హవిర్విభాగముం
బ్రకటితసౌఖ్యకారి యయిపాయకవీచె సమీరణంబు త్ర్యం
బకుఁడట భీమనాయకునిమందిరమధ్యముఁ జూచునత్తఱిన్.

వ. ఇట్లయ్యోగీశ్వరేశ్వరుండు మార్గశిరశుద్ధ చతుర్దశియందు రోహిణీనక్షత్రంబున సిద్ధయోగంబున భీమనాయకుని యభ్యంతరమందిరంబునం బ్రవేశించి, కక్ష్యాంతరంబులుగడచి గర్భగృహమండపంబున భీమనాథు నర్చించి యాపాదమస్తకంబు తద్రూపంబు ముహూర్తమాత్రంబు చింతించి.

శా. కైలాసాచలకేళిమందిరుఁడు శ్రీకంఠుండు సోత్కంఠుడై
ప్రాలేయాచలరాజకన్యకయుఁ దాఁ బ్రహ్మాదిదేవవ్రజం
బాలోకింపఁగ నైకృతంబారసె దక్షారామభీమేశ్వరుం
డై త్రైలోక్యంబునుదివ్యలింగశివతాదాత్మ్యంబువర్ణింపఁగన్.

వ. ఇట్లైక్యంబు నంది బ్రహ్మాదిదేవతలచేఁ బూజితుండై సంతుష్టాంతరంగంబున నప్పరమేశ్వరుండిట్లని యానతిచ్చె.

తే. ఎల్లకాలంబునుండెద నిచట నేను
మొదలి మామామ యారామ పదమునందు
వెండిగుబ్బలిపై వేడ్క వీడుకొల్పి
మేరునగరాజుపైఁ గల మెచ్చువదలి.

— భీమఖండము.

——

# సప్తర్షులు గోదావరిని దక్షవాటికకుఁ గొనితెచ్చుట.



శా. ఎంచన్ బెక్కువిశేషముల్ ధరణిలో నింపారుచున్నట్టి యా
పంచారామములందు దక్షిణమహాపాథోధితీరంబునన్
బంచబ్రహ్మమయామృతప్రకటశుంభద్దివ్యలింగాకృతిన్
మించుం గుబ్బలి యల్లుఁ డొప్పెసఁగు భీమస్వామి యు
[ద్దాముఁడై. 1

వ. అమ్మహేశ్వరున కర్ఘ్యపాద్యాచమనీయార్థంబు తత్సమీపంబున గోదావరీవాహినిం బ్రవహింపంజేయువారై భారద్వాజాదిమహామునీంద్రులు కతిపయప్రయాణంబులు సలిపి యొక్కయెడం దమపురోభాగంబున. 2

సీ. గౌతమీగంగ నాలోల ఘనతరంగఁ
గేలిడోలావిహారసంక్రీడమాన
చక్రవాకబకక్రౌంచసారసాళి
హంసకారండవాటమాద్యద్విహంగ. 3

. కనుంగొని యొండొరులం గాంచుచు. 4

. కంటిరే! ఘోరపాతకౌఘముల నెల్లఁ
గడిమి జంకించుచున్నది గంగ యిపుడు
వీచికాహస్తవిన్యాసవిభ్రమముల
ఘుమఘుమధ్వానహుంకార ఘోష మెసఁగ. 5

తే. యక్షగంధర్వసిద్ధ విద్యాధరోర
గామరవ్రాత భరితోభయప్రతీర
పృథివి యెల్లను రక్షించు పేరటాలు
మమ్ము రక్షించు గోదావరమ్మ యెపుడు.

తే. అమృత మైనపయోధార నహరహంబు
సృష్టిగలజంతుకోట్ల వీక్షింతువీవు
జనని వాటకు నేమి సంశయము చెపుమ
గౌతమీగంగ! యుల్లోల ఘనతరంగ! 7

క. గోదావరి గోదావరి
గోదావరి యనుచుఁ బలుకు గుణవంతులకుఁ
గోదావరితల్లీ సం
పాదింతుగదమ్మ నీవు భవ్యసుఖంబుల్. 8

క. కంబుశిశిరజతకీర్తివి
డంబసితచ్ఛాయకలిత డంబరములు నీ
యంబువు లమృతోపమరుచు
లంబా! మాకొసఁగుఁగాత మభ్యుదయంబుల్. 9

శా. ఆపాతాళగభీరనీరకసుధాహారామలచ్ఛాయకుఁ
ద్వీపాలంకృతికిన్ మహేంద్రనగరీనిశ్రేణికాయష్టికిన్
దాపోపాయవిధావిహర్త్రికి మహాహ్లాదన్యాదృఢాలింగన
వ్యాపారప్రతిపన్న సౌఖ్యకును సాష్టాంగంబు గంగమ్మకున్.

శా. రంభోరూకరశాతకుంభఘటధారాపూరణప్రక్రియా
గంభీరస్వనసాంద్రభిన్నకరిరాడ్గండూషనిర్భిన్నకున్
సంభావించినమస్కరింతుము త్రిసంధ్యంబుల్ ముదంబొప్పసీ
కంభోజాసనకుండికాంబుజవనీ హంసాభ గోదావరీ! 11

క. గౌతమికిఁ బంచమహా
పాతకపటలాంధకార పాటనవిధిరా
గౌతమికి నమస్కారం
బాతతమతిఁ జేయుదము ప్రకామత్నం బెసఁగన్. 12

వ. అని ప్రార్థించి యి ట్లనిరి.

సీ. విచ్చేయవమ్మ శ్రీ వృషభవాహనధర
సామజకటమదాసారధార
పయనమ్మ గావమ్మ భర్గజటాటవీ
కుటజశాఖాశిఖాకోరకంబ
రావమ్మ యాదిమబ్రహ్మదోఃపల్లవ
స్థితకమండలుపుణ్యైకతీర్థజలమ
లేవమ్మ విశ్వంభరావధూటీకంఠ
తారమౌక్తికహారధామకంబ

తే. తెరలతో వీచికలతోడ దరులతోడ
విమలడిండీరఖండదండములతోడ
మురువు దీపింప నామోద మునుజవంబు
వడువునొప్పంగ గంగమ్మ నడువవమ్మ! 14

మ. అదె మాస్వామి సుధారసోద్భవుఁడు దక్షారామభీమేశుఁ డ
భ్యుదయంబొందిప్రతిష్ఠఁగైకొనెడు నంభోరాశి తీరంబునన్
బదమా షట్పదమాలికాపరిలసత్పాథోధునీసంపదా
స్పదనానా సలిలప్రవాహలహరీసంభార గోదావరీ. 15

ఆ. సోమశేఖరుండు భీమేశ్వరస్వామి
తివిరినాఁడు సుప్రతిష్ఠఁ బొంద

తోడఁదప్పకుండ నీ విచ్చేయఁగా రాదె
త్ర్యంబకాద్రి సరసీధామలక్ష్మి. 16

మ. అనిమెప్పించిమహర్షులెల్లరును నత్యాశ్చర్యమొప్పన్ బ్ర
వనిరూఢింగొనివచ్చిరంధ్రవసుధా వక్షోజహారావళిన్ భ్రా
మునుబృందారక సేవ్యమానసలిలన్ గోదావరీవాహినిన్
వెనుకన్ ముందఱఁ బార్శ్వదేశముల నావేశించి సేవించుచున్.

వ. అమ్మహాపుణ్యవాహినియును.

మ. కెలనన్ ముందఱ సిద్ధకింపురుషులుం గీర్వాణులున్ నాగసా
ధ్యులువిద్యాధరకిన్నరేంద్రులుసముద్భాషింపదివ్యాప్సరో
లలనాబృందము లాడ దానవులు పెల్లుంగ్రోల్లుపట్టంగ బొ
బ్బలునార్పుల్ కటుసింహనాదములునుత్పాతిల్లధాత్రీస్థలిన్.

చ. మలఁగిమలంగి భీమపతిమందిర మండలసిద్ధభూమికిన్
దొలఁగితొలంగి యుచ్ఛలిత తోయదరంగపరంపరోద్ధతిన్
జెలఁగి చెలంగి యారభటిశీర్ణధరాధర ధాతురేణులన్
గలఁగి కలంగి పాఱె వడిఁగౌతమకన్యక దక్షవాటికన్.

తే. దేవదుందుభు లుడువీథిఁ దీటుకొలుప
నమరు లందంద పుష్పవర్షములు గురియ
మునిజనంబులు జయజయధ్వను లొనర్ప
దక్షవాటంబుఁ జొచ్చె గౌతమతనూజ.

సీ. త్ర్యంబకాచలశిఖాగ్రంబునం దుదయించి
పొదలి పూర్వావర్తభూమిఁ దరిసి
మలఁగి దండకవనీమధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థ మొఱసి

పట్టిసశ్రీవీరభద్రేశు సేవించి
క్షేత్రసోమేశు మందిరము డాసి
యేచి యనంత భోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవ గాఁగఁ
తే. గోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖదేశంబుఁ సుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టుకొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె. 22
తే. నీరుకడఁగోళ్ళఁగూడి ముక్కన్నిటేఁగవయు
మొగులు బడి వాహినుల కెల్లు మొరయవచ్చు
వార్థులేడింటికెవలపు వనిత యైన
మంగళోత్సంగ గౌతమీ గంగ యెదుర. 23

—భీమఖండము.-

---

# విఖ్యాతాంధ్రనగరములు.

## కొండవీడు.

సీ. పరరాజ్య పరదుర్గ పరవైభవశ్రీలఁ
గొన కొని విడనాడుఁ గొండవీడు
పరిపంథిరాజన్యబలముల బంధించు
కొమరు మించినజోడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యురిత్రాడు కొండవీడు
చటుల విక్రమకళాసాహసం బొనరించు
కుటిలాత్ములకు గాదు కొండవీడు

తే. ప్రవన ఘోటక సామంత సరసవీర
భట నటానేక హాటక ప్రకటగంధ
సింధురారవ మోహన శ్రీలఁ దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు.

—[illegible]లువు.

కొండపల్లి.

సీ. ప్రభవించె నే వీటఁ బర్వతాగ్రంబున
నరిగిరీశ్వరుఁడు శ్రీనాయకుండు
వసియించె నే వీట వర్ణిత సాలాంత
రమున మూలస్థాన రాజమౌళి
యుదయించె నే వీట నుత్తరాశాతట
భూషణీకృతనింబ పుట్టలాంబ
వరియించె నే వీట వలదిశాకోణంబు
నందు గుబ్బటల మొగలారమూర్తి
తే. వినుతిఁ గాంచె నే వీటను విప్రరాజ
వైశ్యశూద్రాది బహువిధ వర్ణసమితి
యట్టి పురరత్న మొప్పు భవ్యాంబుజాత
మండితామర తరువల్లి కొండపల్లి.

—సకలనీతినిధానము.

బందరు.

సీ. శ్రీకంఠ వైకుంఠ సేవావికుంఠవం
దారు మందిరము బృందారపురము
నిరతోత్స వైశ్వర్య నికరాభిభూతబృం
దారకపురము బృందారపురము

సంతతాయాత యాచకజనవ్రాతమం
దార భాసురము బృందారపురము
సకలవర్ణాశ్రమాచార సంపత్సమం
దారతి భరము బృందారపురము
తే. శిల్పినర్తక వర్తక చిత్రకార
సూత్రకారాదివివిధ విచిత్రకృత్య
దానధర్మపర ప్రజోత్కరచకోర
కారవిందారి కరము బృందారపురము.

పోచిరాజు వీరకవి — భల్లాణచరిత్రము.

పీఠాపురము.

సీ. చక్రవాళాహార్యజలధితుల్యోన్నత
ప్రాకార పరిఖావిరాజితంబు
సాంద్రముక్తా సౌధచంద్రశాలానేక
భర్మనిర్మిత హర్మ్య శర్మదంబు
కరిసైంధవాందోళికాధేను ధనధాన్య
వన దేవగృహ సరోవర్ణితంబు
విమల చాతుర్వర్ణ్య విద్వత్కవిశ్రేష్ఠ
భటనటామాత్య విస్ఫారితంబు
తే. రాజమాహేంద్ర వరదుర్గరాజ్యభూరి
భారసంభరణా శ్రాంత భాసమాన
రావుమాధవనృపపరిరక్షితంబు
భోగనికరంబు పీఠికాపురవరంబు.

కూచిమంచి తిమ్మకవి — లక్షణసారసంగ్రహము

## రాజమహేంద్రవరము.

సీ. ఉండు నే వీట మార్కండేయమునినాథ
సజ్జలింగ మనంగ శాసనుండు
ప్రవహించు నే వీటి పశ్చిమ ప్రాకార
మొరసి గంగమ్మ సాగరముకొమ్మ
యావిర్భవించినాఁ డే వీటికోటలో
బలభేది సదనగోపాల మూర్తి
పాలించు నే వీటి ప్రాగుదక్కోణంబు
నుమ ప్రోది శ్రీమల్లగూరిశక్తి
తే. ప్రబలిధారసురత్రాణ భద్రజాతి
కరిఘటాసైన్యదుస్సాధ కనకలోహ
గోపురద్వారకవాట ప్రదీపితమతి
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

— కాశీఖండము

## సోమరాజుపల్లి.

సీ. లవణాబ్ధివేలహేలాకాంచి యగునంధ్ర
ధరణిమండలికి ముత్యాల జల్లి
సంగ్రామ పార్థరాజన్య రాజశ్రీకిఁ
బెంపుమీఱిన జగజంపు వెల్లి
దాతలు సముదంచిత ప్రసూనములు గాఁ
గామితార్థము లిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గువిద్యలకు నపూర్వఘం
టాపథంబైన పట్టణమతల్లి

తే. పంటనృపకౌస్తుభములకుఁ ౹ బాం వెల్లి
కదన జయలక్ష్మితొలుచూలు ౹ కన్నతల్లి
విపుల భుజదర్ప దర్పిత౹విమతరాజ
రాజహృద్భల్లి మా సామ౹రాజుపల్లి. శృంగార శాకుంతలము.

నెల్లూరు.

సీ. పాలించు నేవీట ౹ బ్రహ్మాదవంద్యుండు
లీల మూలస్థాన ౹ లింగ గురుఁడు
దీపించు నే వీట ౹ దేవాలయంబులు
ధావళ్య నవసుధా౹ధౌతము లయి
ప్రవహించు నే వీట ౹ బ్రహ్మాండ కర్పరం
బొరసి మిన్నులుముట్ట ౹ నున్న పెన్న
చెలువందు నే వీటఁ ౹ జిరకాల జీవన
స్వర్ణాల చెలువు సం౹పూర్ణ మగుచు
తే. ప్రజలకును మన్కి సకలసం౹పదల కున్కి
భోగముల వీడు సురపతి౹పురికి నీడు
నమ్మికల టెంకి వైరులఁ ౹ జిమ్ముకొంకి
భాగ్యనికరంబు నెల్లూరు ౹ పట్టణంబు. 7

మంగళగిరి.

సీ. కల్యాణసరసిలోఁ ౹ గదిసి మజ్జన మాడి
ధౌత వస్త్రంబు లం౹దముగఁ దాల్చి
కుధరాగ్రమెక్కి మా౹ర్కొండ లక్ష్మి భజించి
నరసింహునకు వంద౹నములు సేసి
మిరియంబు కలఁకువ ౹ మెదిపి చక్కెఱతోడ
గలిపి తియ్యని పాన౹కములు చేసి

స్వామి కర్పించి శేషమంబైన నగమును
భక్తుల కెల్లను బంచిపెట్టి
తే. నగము దిగి వచ్చి శివదర్శనంబు చేసి
దిగువ నరసింహు నిందిరాదేవిఁ గొలిచి
భోగమోక్షంబు లనుభవింతురు జనులు
సత్య మిది మంగళాచలస్థలమునందు. 8
సీ. వేంకటాచలమున వేసట నొందక
వడలు భుజింపఁగాఁ బొడము దప్పి
శ్రీరంగమున నాసదీఱంగఁ బొంగళ్లు
భోజనం బొనరింపఁ బొడము దప్పి
కాంచీపురంబులోఁ గాంక్షతీరెడునట్టు
లిడ్డెనల్ భక్షింప నెసఁగుదప్పి
యాళగిరిస్థలమున నాపోవఁగా దోసె
లారగించిన బుట్టినట్టిదప్పి
తే. యర్చకస్తోమ హస్తశంఖాగ్రయుక్త
లలితగుడజలధారా ఘుళంఘుళాయ
మానపానీయ మహిమచే నణఁచికొనును
జలజనాభుండు మంగళాచలమునందు. ౯

పాలకొండసీమ.

శా. క్షేమాకీర్ణవికీర్ణధామములు సత్క్షేత్రోరురంభాటవీ
స్తోమంబుల్ బహుశాలిధాన్యతతులెచ్చోటఁ నదీమాతృక
గ్రామంబుల్ బహుళాగ్రహారములనేకంబుల్ ధరంజూడఁగా
క్షామం బన్నది లేదు క్షీరగిరిదేశంబందు.నెప్పట్టునన్. 10

డిండిముఁడు మునులకుఁ జెప్పిన

# విద్యానగరనిర్మాణము.



శా. విద్యారణ్యు లనంగ నెవ్వరతఁడే ? విద్యన్ బ్రకాశించె నీ
హృద్యంబైన పురంబొనర్చు విభవం బేలాగునం గాంచె నో
చోద్యంబయ్యెడి మీరు విన్న కథ యిచ్చో లెస్సగాఁ దెల్పుఁడీ
యాద్యంతంబున నట్టి దత్సభికు లాహ్లాదంబుతో నుండగన్.

క. స్వామీ ! విద్యారణ్య
స్వాముల చరితంబుఁ దెలుపవలె నంటిరిగా
యీ మానవులకు నమ్ముని
సామర్థ్యం బెఱుఁగ వశమె జగతీరమణా! 2

మ. నరులజ్ఞానవిమోహితాత్ములగుటన్ రక్షింపఁగా నెంచి శం
కరుఁడే శంకరుఁడై విభేదమతముల్ ఖండించి వేదాంతశా
స్త్రరహస్యస్థితిఁ దెల్పఁగా నతఁడె విద్యారణ్యమూర్తిన్ జగ
ద్గురుఁడై తోఁచె దదీయవైభవము లెందు న్మెచ్చఁగా శక్యమే?

తే. సకలవిద్యాప్రవీణుఁడై జనవరేణ్యు
యమ్మహాముని శ్రీలక్ష్మి నాత్మఁ గోరి
మహితచింతామణీమంత్రమర్మ మెఱిఁగి
సాత్త్వికోన్నతిఁ బెక్కేండ్లు జప మొనర్చె. 4

వ. ఇట్లఖండవిద్యాసుధాసాగరంబునఁ బొడమినరత్నంబుకైవడిం
దనరు నమ్మహాలక్ష్మింగూర్చి తదీయసాక్షాత్కారం బపేక్షిం-
చి యమ్మునీంద్రచంద్రుండు బహుకాలంబు తీవ్రతపంబు
సేయుటయుఁ దత్తపోగ్రతకుం గరుణించి యొక్కనాఁడు. 5

సీ. కలువలు వెదఁజల్లు కలికి చూపులతోడ
ముద్దుగుల్కు మెఱుంగు మొగముతోడఁ
గుందంబు నడఁగించు మందహాసముతోడ
విలసిల్లు వాలారు వేణితోడఁ
మించుల నలరించు మేల్మిసొమ్ములతోడఁ
దమ్మిపూ లమరుహస్తములతోడ
శ్రీహరికొనగోటి చెక్కు నొక్కులతోడఁ
దళుకుమించు కడానిసెవలువతోడఁ
తే. గాముఁగన్నమ్మ నలమేనిసామి కొమ్మ
కమ్మపూరెమ్మ యపరంజి కళుకుబొమ్మ
కలిమిముద్దులగుమ్మ సత్కరుణ గ్రమ్మ
నమ్మునీంద్రుని మ్రోలఁ బ్రత్యక్ష మగుచు. 6
తే. వరమునీశ్వర వేఁడుము వర మటన్నఁ
గరములు మొగిడ్చి సంతోషకరము గాఁగఁ
బరమసద్భక్తి వెలయఁ దత్పరమతీవ్ర
భాసమానస్థితుల్ మించఁ బ్రస్తుతించి. 7
తే. అమ్మహాదేవితోడ నిట్లనియె నతఁడు
వేడ్కమీఱంగ నాపేర వెలయునట్టి
పురముఁ గావింపవలయుఁ దత్పురమునందుఁ
జెలఁగి సతతంబు నీవు వసింపవలయు. 8
చ. అనవిని యిందిరారమణి యమ్మునిచంద్రునితోడఁ బల్కె నో
వినుతగుణాఢ్య నీదు వెనువెంట నె వచ్చెదఁ బొమ్ము ముంగల౯
ఘనతరలీలలం బురము గట్టుటకుం దగుచోటుగాక న౯
గనుఁగొనఁబోకు మియ్యెడ నె క్రమ్మఱ సన్మునిరాజశేఖరా.

సీ. కలువలు వెదఁజల్లు ǀ కలికి చూపులతోడ
ముద్దుగుల్కు మెఱుంగు ǀ మొగముతోడఁ
గుందంబు నడఁగించు ǀ మందహాసముతోడ
విలసిల్లు వాలారు ǀ వేణితోడఁ
మించుల నలరించు ǀ మేల్మిసొమ్ములతోడఁ
దమ్మిపూ లమరుహ ǀ స్తములతోడ
శ్రీహరికొనగోటి, ǀ చెక్కు నొక్కులతోడఁ
దళుకుమించు కడాని ǀ వలువతోడఁ

తే. గాముఁగన్నమ్మ నలమేని ǀ సామి కొమ్మ
కమ్మపూరెమ్మ యపరంజి ǀ కళుకుబొమ్మ
కలిమిముద్దులగుమ్మ స ǀ త్కరుణ గ్రమ్మ
నమ్మునీంద్రుని బ్రోలఁ ǀ బ్రత్యక్ష మగుచు. 6

తే. వరమునీశ్వర వేఁడుము ǀ వర మటన్నఁ
గరములు మొగిడ్చి సంతోష ǀ కరము గాఁగఁ
బరమసద్భక్తి వెలయఁ ద ǀ త్పరమతీవ్ర
భాసమానస్థితుల్ మించఁ ǀ బ్రస్తుతించి. 7

తే. అమ్మహాదేవితోడ ని ǀ ట్లనియె నతఁడు
వేడ్కమీఱంగ నాపేర ǀ వెలయునట్టి
పురముఁ గావింపవలయుఁ ద ǀ త్పురమునందుఁ
జెలఁగి సతతంబు నీవు వ ǀ సింపవలయు. 8

చ. అనవిని యిందిరారమణి ǀ యమ్మునిచంద్రునితోడఁ బల్కె నో
వినుతగుణాఢ్య నీదు వెను ǀ వెంట నెవచ్చెదఁ బొమ్ము ముంగలన్
ఘనతరలీలలం బురము ǀ గట్టుటకుం దగుచోటుగాక నన్
గనుఁగొనఁ బోకు మియ్యెడ న ǀ గ్రమ్మఱు సన్మునిరాజశేఖరా.

వ. అనిన నమ్మహానుభావుం డట్లు తన యున్న చక్రవర్తికిం
జక్కని దక్షిణంబుగాఁ గతిపయప్రయాణంబులు సలిపి
ముందటఁ దుంగభద్రాస్రవంతిం గాంచి, యందుఁ గృతావ
గాహులై యచ్చటిమానులం దన్నదీతటప్రదేశప్రభా
వంబుఁ దెలుపం గోరినఁ బురాణజ్ఞు లగు వా రిట్లనిరి. 10

తే. మునుపు సుగ్రీవుఁడును వాలియును గడంగి
భండనముఁ జేసి రిచ్చటఁ బ్రబలుఁడైన
వాలి కలికి మతంగపర్వతము నెక్క
నల్ల రవిసూనుఁ డట శత్రుఁ డరుగరామి. 11

తే. అమ్మతంగమునీంద్రుని యాజ్ఞవలన
శాపయుక్తుండు గాన వాలి శైలమునకుఁ
జనఁగ భయమంది సుగ్రీవుఁ జాడఁబోక
క్రమ్మఱును వాలి, యిది పూర్వకథ మహాత్మ! 12

సీ. ఇది నిజోన్నతశృంగహేవాకజితమేరు
కుధరమై తగుహేమకూటశైల
మది పతంగతురంగహారిత్ప్రభాసంగ
మరకతశిఖర రమా మాల్యవంత
మిది వశ్యమునిదృశ్యహితలతాంచితమహా
భూమిజయుతఋష్యమూక శిఖరి
యది మతంగజబృంహితారవప్రతిరవ
ప్రదకంధర మతంగపర్వతంబు

తే. మునిజనోత్తమ కిష్కింధ యనఁగఁ దనరు
నిమ్మహాపుణ్యభూమి నీ వెందు నిల్వ

న[illegible] మనుటయు విని యమ్మహానుభావుఁ
డాత్మ నద్భుతమంద నయ్యవసరమున. 13

తే. తత్ప్రదేశంబునందు నెంతయును వింత
మీఱఁగా నొకకుందేలు సారమేయ
మును మహోద్ధతిఁ దఱుము నబ్బురముఁ జూచి
యౌర ! యిది యద్భుతం బని యాత్మ నెఱిఁగి. 14

క. వీరక్షేత్రం బగు నిది
గారవమున నగర మిచటఁ గావింప శుభ
శ్రీ రంజిల్లు నటంచున్
సారమతిన్ సన్ముహూర్తచతురత వెలయన్. 15

సీ. కోటలా తెఱగంటి పాటలాధర లెల్ల
నాటలాడఁ దలంచ హాసుమించ
మేడలా మిన్నేటి జాడలానినయంచ
జోడు లాదటఁగాంచు సొబ గెసంగ
శాలలా నవరత్నజాలలాలితకాంతి
లీలరాశినవింత మేలుఁజూప
బాలలా మరుని బాగాల లాఁగునఁ బల్కు
హేలలోఁ గొనఁజాలు నింపుమీఱ

తే. నవ్పుర నిర్మించెఁ దనపేర నఖిలలోక
పాలకపురాధిక ప్రభాబంధురముగఁ
గరిమ దనరంగ విద్యానగరము నాఁగ
మెఱయుపురరత్న మాధరామరవరుండు. 16

క. అది మొదలిఱువదిపట్టము
లిదివఱకు నృపాలతిలక యిది మీఁదటన

ర్వాదియేండ్లు వెలయునట్లుగ
మొదటఁ నిర్ణయ మొనర్చె మునివరుఁ డెలమిన్. 17

— కృష్ణరాయవిజయము

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి
కేలూఁతయొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళ బురమేగఁ
బల్లకి కేలూఁతఁ బట్టి యెత్తెఁ
గోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగినసీమలయందు నిచ్చె
బిరుదైన కవిగండ పెండేరముల కీవె
తగు దని తానె పాదమునఁ దొడిగె
తే. నాంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దనకవీంద్ర యని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేగలేక
బ్రతికియుండితి జీవచ్ఛవంబ నగుచు. 18

అల్లసాని పెద్దన.

---

## వ్యాసాదులు ఆకసమునుండి యాంధ్రమండలమును గనుంగొనుట.

సీ. ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావర జలము తేనె
బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు తేఁటు
లకరులు చారుదివ్యస్థలములు

నాళంబు లవణాబ్ధి వేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
తే. గౌతమీసింధుకాంతేయ కన్యానదులు
తుల్యభాగయు నేలేఱు దుమ్మికానలు
భువనసంభావ్యమైన యీపుణ్యభూమి
ఘనఘసంసారతాపశాంత్యౌషధంబు. 1

ఆంధ్రదేశపు సముద్రపు టలలు.

సీ. జనమేజయారబ్ధ సర్పాధ్వరాహూత
చక్షుశ్శ్రవస్సహస్రములఁ బోలి
బ్రహ్మాండమండల ప్రాసాదసంభార
హరిమణిస్తంభసంహతుల నాఁగ
జంభారిదోస్స్తంభ దంభోళిఖండితాం
జనశైలశిఖరపుంజములఁ బెనఁగి
సంహారసమయజంఝామారుతోద్ధూత
కాలాంబువాహసంఘముల గెలిచి
యాడుచున్నవి తీండ్రిల్లి యంబరమునఁ
జేయుచున్నవి త్రిభువనాశ్లేషకంబు
నబ్జనాభుని తూఁగుటుయ్యాలలు గంటె
వేనవేలు పయోరాశి వీచిఘటలు. 2
శా. కాశిం జచ్చినయంతఁ గానిపడయుం గారానికైవల్యమ
క్లేశంబా నిట వేదనాయకునిచే లీలాగతిం జేరరా

రో శీఘ్రంబున మర్త్యులార! యను నాకారూపంబున నార్తియు నా
కాశాస్ఫాలనగౌతమీజలధిసంగస్థానకల్లోలముల్. 3

మ. అదె సంవేద్యము కోటిపల్లి యదె దక్షారామ మర్ఘపట్టణం
బదె యభ్రంకషసౌధకూటఘనహేలావాస ముచ్ఛ్రాయసం
పద సొంపారెడు భీమలింగము మహాప్రాసాదభూమీధరం
బిదె సప్తర్షినదీప్రవాహ మిదె సంవీక్షింపుఁ డేకాగ్రతన్.

సీ. అదె పట్టిసస్థాన మందుండు వీరభ
ద్రేశ్వరస్వామి యర్ధేందుమౌళి
యదె పుండరీకాద్రి యచటమార్కండేయు
నిలువేల్పు ముక్కంటి వెలసెఁ దొల్లి
యదె కుమారారామ మాహాత్మ్యరేఖయు
చాళుక్య భీమేశు సదనవాటి
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
హుంకారిణీదేవి యోలగంబు

తే. వాఁడె మాయింటివేల్పు పల్వలపురమున
నుండు లింగంబు ఫణిరాజకుండలుండు
సప్తముని సింధుసంగమేశ్వరుఁడు వాఁడె
కుండలాముఖ మిదె మానికులవరేణ్య! 4

---

# అగస్త్యుని యాంధ్రదేశయాత్ర.

వ. అనంతరంబు దక్షిణకాశీసందర్శనంబునం గాని కాశీవియోగ
వేదనాభారంబు డిందువడదని డెందంబున నిశ్చయించి మంద
మందప్రయాణంబులఁ గొందలి రాకుఁబోడిఁ ముందఱఁబిలుంద

నడపించుచు నెడనెడఁ బుణ్యవాహినీతీర్థంబులఁ గ్రుంకులు
వెట్టి యిష్టమూర్తినభ్యర్చించుచుఁ గొన్నివాసరంబులకుఁ
గుంభసంభవుఁడు గోదావరి నారసి కొనుచు నాంధ్రదేశం
బున కరుగునప్పుడు. 1

2. అహరారంభములందుఁ బ్రస్రవణశైలాధిత్యకాకందరా
గుహరక్రోడ కటాహ గద్గద నటద్గోదావరీసింధువా
ర్లహరీశీకరమాలికాశిశిరముల్ పంపాసఖుల్ దండకా
హ్వానగ్రాహులు వాయువుల్ దవసికిం గల్పించె నాహ్లాదమున్.]

ఋషికిఁ బంపాసరో వీచి పృషత శిశిర
గంధవాహ ప్రవాహ సంబంధములును
గాశికాక్షేత్ర విప్రయోగప్రభూత
తాపశాంతి యొనర్పంగ నోపవయ్యె. 3

పట్టిస శ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథునంఘ్రులకు నెఱఁగి
పురశాసను ననంతభోగేశ్వరస్వామి
హిమశైలకన్యకాధీశుఁ గొలిచి
పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి
చేరి మార్కండేయశివు భజించి
కోటిపల్లీ తీర్థకుండలాముఖముల
నర్ధేందుధరు విరూపాక్షుఁ దలఁచి
పల్వాలస్థానమున భూతభర్త నిలిపి
కొంత మున వృద్ధగంగను గ్రుంకవెట్టి
వతువాటిక సప్తగోదావరమున
మునిఁగి భీమేశ్వరునిఁ గాంచె మునివరుండు. 4

శా. ప్రాతఃకాలము తీవ్రభానుఁ డుదయింపన్ సప్తగోదావర
తటిపూరమునన్మునింగి యభవున్ సోమార్ధచూడామణిన్
జ్యోతిర్లింగమయస్వరూపుఁ గొలిచెన్ శుద్ధాంతరంగంబునన్
శాతిప్రత్యమహాప్రభావనిధి లోపాముద్ర భీమేశ్వరున్.

మ. మునిచూడామణి యెల్లసత్కళలకున్ మూర్ధాభిషిక్తుండుగా
వున భూరికరణాంగహారములు తాఁ బొల్ మెచ్చి కీర్తించుచున్
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజనం
దనయుండాను దేశిమార్గమున గంధర్వాప్సరోనృత్యముల్.

వ. అంత. 7

తే. కుంభజుఁడు దక్షిణాభిముఖుం డగుటయు
నదను వీక్షించి వచ్చెనో యనఁగ వచ్చె
శంబరారిప్రతాపాగ్ని సామిధేని
నవశరద్వేళ శ్రీభీమనాథుఁ గొలువ. 8

తే. జిగురుఁ గొన్న రజస్స్ఫూర్తిఁ జెఱఁగుమాసి
జలద కుంభోదకంబున జలక మాడి
మలయజాచ్ఛపయోధర మందలీల
దిగ్వధువులందు శుచిఁ బ్రవర్తించె నినుఁడు. 9

వ. అనంతరంబ. 10

తే. కార్తికవేళ భీమశంకరుని నగర
వింధ్యసంస్తంభయిత దూతె విమల బుద్ధి
తొయ్యలియుఁ దానుఁ బుచ్చుల తోరణంబు
కలుష సంహతి సంహారకారణంబు 11
దక్షిణవారాణసి యగు
దాక్షారామంబు సొచ్చి తరుణేందుధరున్

వీక్షించిన గోలెను గా
శ్రీక్షేత్రాలోకసుఖము చేకుఱె ఋషికిన్. 12

క. క్లేశంబును సౌఖ్యంబును
నాశువునను గుంభజన్ముఁ డభిమర్శించెం
గాశీవిరహము దక్షిణ
కాశీసంగమము వరుసఁ గలిగినకతనన్. 13

వ. పరోపకారపరుం డైన వానికిఁ బుంఖానుబుంఖంబులు సంపదలు సంభవించుఁ దీర్థస్నాన దాన జప హోమ దేవతార్చనాదులు పరోపకారంబునఁ బోలనేరవు; పరోపకారంబు కంటె ధర్మంబు లేదు; లోకోపకారపరాయణుం డైన పాతాపితావసున కింతలేసి ప్రయోజనంబులు సమకూఱకుండునె? యివ్విధంబున భోగమోక్షనివాసంబయిన దాక్షారామంబునం గొన్నిదినంబులుండి కొల్లాపురంబున శ్రీమహాలక్ష్మిదర్శింపం బోదలంచి యాత్రాపరుండై. 14

సీ. అంతఃప్రవాహియై యావిర్భవించె నే
ధరణీధరము పొంతఁ దల్లిఁ గాసి
పాఱె నే శైలంబు పాదమూలంబున
గల్లేటితో వృద్ధగంగ వాసి
యుదయించె నేకొండ యుత్తరాశారసా
ఫలకుక్షి సప్తగోదావరంబు
జనియించె నే శిలోచ్చయము దక్షిణమునఁ
గణ్వవాహిని యుప్పుకడలికొమ్మ

తే. పద్మగిరి తోడఁబుట్టు వే పర్వతంబు
బలిసి యుండు నేయద్రికిఁ బంచలింగి

యట్టి వీరభద్రాఖ్య మహాచలమున
కరుగుదెంచెను వింధ్యమదాపహారి.

వ. ఇట్లరుగుదెంచి లోపాముద్ర కిట్లనియె

తే. దక్షిణానంద విపిన మధ్యంబునందుఁ
గ్రతువిధి ధ్వంసవేళ దేవతల నఱకి
వీరభద్రేశుఁ డేయద్రి వెన్నుఁ దన్ని
గౌతమీవారిఁ దరవారిఁ గడిగినాఁడు.

తే. పంకజక్షాత్మధరము వీరభద్రగిరియు
నంధ్రభూమికి వక్షోరుహద్వయంబు
భువన చక్షుఃకదంబ మంభోరుహాక్షి
గౌతమీగంగ ముత్యాల కంఠమాల.

సీ. ఎవ్వాఁడు డాచేతి క్రొవ్వాడి నఖమునఁ
జిదిమె భాషాదేవి చిగురు ముక్కు
గనకమేఖల గుచ్చి కట్టె నెవ్వాఁడు లీల
జెఱఁగుమైఁ బూషార్కు మెఱుఁగుఁ బండ్లు
కోరకెవ్వాఁడు పదాంగుష్ఠభాగంబున
నుడురాజు పొట్టగు జ్జులుకనూఁదెఁ
దఱిగె నెవ్వాఁడు ఖడ్గ ధారాంచలంబున
నగ్నినాలుక లేడు నంటఁబట్టి

తే. మోదె నెవ్వాఁడు ముప్పది మూఁడు కోట్ల
వేలుపులఁ బాఱఁబాఱ వెన్వెంటఁ దవిలి
యట్టి శ్రీవీరభద్రుఁ డీ యద్రిమీఁద
భద్రకాళియుఁ దానుండు బన్నవయున!

తే. బ్రహ్మసంవేద్య మాదిగాఁ బట్టి సాంత
మతివ గోదావరీ నదీహారమునకు
నడుమ నాయకరత్నమై నలువు మిగులుఁ
బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి. 20

వ. అని చెప్పి యచ్చోటుఁ గదలి కతిపయప్రయాణంబుల. 21

క. క్షీరారామంబునఁ బ్రా
చ్యారామంబునను గాది మారామమునం
దారాధిప చూడామణి
నారాధించెను మునీంద్రుఁ డతివయుఁ దానున్. 22

వ. అనంతరంబ కతిపయప్రయాణంబుల శ్రీశైలంబుదరిసి. 23

తే. అర్థిఁ గుంభోద్భవుం డిట్టు లనియె సతికిఁ
బద్మలోచన! చూడు శ్రీ పర్వత మిది
పాయ కిం దుండుఁ బార్వతీ ప్రాణవిభుఁడు
మల్లికార్జున దేవుండు మదనవైరి. 24

తే. ధవళలోచన! శ్రీపర్వతంబు మహిమఁ
బ్రస్తుతింపంగ శక్యమే బ్రహ్మకైన
గండ శిల లెల్ల శంభులింగంబు లిందు
సిద్ధ మునులిందు జరియించు చెంచులెల్ల. 25

క. చాటన్న నిదు ముక్తుల
శ్రీకాశీక్షేత్ర మెవ్వరికి నే; నికటం
బీడుధర మిచ్చు శిఖరా
లోకనమాత్రమున ముక్తు లుల్లసిలంగన్. 26

—కాశీఖండము.

# ఆంధ్రులు : ఫ్రెంచివారు.

---

(రంగరాట్ఛందస్సు.)

సీ. ఘనుఁడు విద్యారణ్యుఁ ఽ డనుపుణ్యపురుషుండు
బహుళతరైశ్వర్య ఽ పదవిఁ గోరి
పరదేవతోపాస్తి ఽ బహుకాల మొనరింప
నయ్యంబ ప్రత్యక్ష ఽ మగుచు నీదు
కోర్కెలీడేర్తు నింఽకొకజన్మమున నంచుఁ
బలికిన నాకుల ఽ పాటుఁ జెంది
సన్యసించినను దత్ఽక్షణమున నాదేవి
సాన్నిధ్యయై మహైశ్వర్యసమితి
తే. బలము నొసఁగినఁ జింతించి ఽ తెలివిఁ గాంచి
విజయనగరాజ్యపురముఁ గాఽవించి మించి
దీనిఁ బాలించుటకు యోగ్యు ఽ డైన మేటి
యెవ్వఁడో యని యాత్మలో ఽ నెంచుకొనుచు.

తే. ఆమహారణ్యసీమ వేఽటాడువిజయ
నందనునిఁ జూచి యతని నాఽనగరమునకు
శ్రీకరంబుగఁ బట్టాభిఽషిక్తుఁ జేసి
విజయనందనగాయుల ఽ పే రొసంగె. 2

క. అతఁడు సమస్తభూమివలఽయుం బనవద్యవిశేష నీతి ప
ద్ధతిఁ దగ నేలుచుం గుటిల ఽ దర్పవిరోధి వరూథినీ హిమ—
పతతి సహస్రభానుఁ డనఁ ఽ బ్రస్తుతకెక్కి మనోజ్ఞభాషియై
తజన పోషియై ప్రజలఁఽజేకొని ప్రోచెను వన్నె వాసిగన్. 3

ద్వర్గంబున గర్భదారకుండను రాజకంఠీరవుం డుదయించి
నదిన ప్రవర్ధమానుండై వదాన్యగుణ విభాసమానుండై యా
ననగరంబు పాలించుచుండెఁ దదీయకీర్తి నిఖిల దేశంబుల
ండి మెండుకొనినం జూచి కుముదుండు మొదలుగాఁ గల
దిగ్గజంబు లెనమండ్రు గోలకొండనుండి వెలువడి యా
ర్భదారకనృపాలుని రాజధాని యైన యయనపురంబుఁ జేరి
రివాకిట వచ్చునెడ, నందు వడ్లకణజంబు ముందఱఁ జింది
యున్న ధాన్యం బేర్పఱించు నేర్పరియే గర్భదారకుండని
చ్చటి వారలచే నెఱింగి యిట్టివాఁడు మన కేమి త్యాగం
బుఁ బోయెడి నెందులకువచ్చితిమని కొంతచింతించి యతని
తంజేరి యాశీర్వదించిన నారాజన్యమూర్ధన్యుండు వారి
ంతరంగం బెఱింగి చిఱునవ్వు నవ్వుచు నవ్విద్వన్నికరంబును
యాంతఃపురంబునకుం దోడ్కొని పోయి రంగలరారు
గారు పళ్లెంబులం జిరరత్నంబులగు నవరత్నము లుంచి, వేఱ
వడ్డించి భుజియింపుండని యుపచరించిన నయ్యర్థులతని
ర్థతకు హెచ్చుగా మెచ్చినం జూచి యనంతరంబ షడ్రసో
ంబుగా భోజనంబుఁ జేయించి వలయు ధనకనక వస్తు
హన భూషణాంబరంబులు బహుమతులొసంగి యొసంగిన
సను వీడ్కొలిపిన వార లుప్పొంగి. 14

నిటువంటిదాత కలఁడే త్రిజగంబులలోన నెన్నఁగా
గుణాభిరామ యనిసారెకు సన్నుతిఁ జేసి గోలకొం
జని గర్భదారకు గుణాతిశయంబుల నెల్ల మేలు త
మకరాంక భూపతికిఁ దెల్పిన నాతఁడు సంతసించుచున్.
దారకుఁ బిలిపించి క గారవించి

ఛత్రపతి యనుపేరును ƒ వేత్రపురము
కోటి రాజ్యంబు రథరథ్య ƒ కుంజరములు
సన్నుతు లొసంగి పనుప ƒ నుత్సాహలీల. 16

ఉ. వేత్రపురంబుఁ జేరి కడుƒ వేడుక మీఱఁగ దానధర్మముల్,
పాత్ర మెఱింగి సేయుచునƒ పారయశంబునుగాంచి యెంతయుం
బుత్రులు లేమి డెందమునƒ బొక్కుచు నుండెడు గర్భదాక్ష
ఛ్ఛత్రపతి క్షమాపతికిƒ సారసనేత్రు దయాసమగ్రతన్. 17

క. శ్రీలక్ష్మమాంబయందున
శోలయనరనాథశౌరి ƒ సూనృతభాషా
శీలుఁడు వడమల ధరణీ
పాలుఁడుఁ దిరుమల విభుండుఁ ƒ బ్రభవించి రొగిన్. 18

వ. తద్వంశంబున. 19

సీ. నీలకంధరురీతి ƒ నీలకంధరు భాతిఁ
దనదాన విభవంబు ƒ ఘనతఁ గాంచ
రాజరాజును మీఱి ƒ రాజురాజును గేరి
తనమహైశ్వర్యంబు ƒ ఘనతఁ గాంచఁ
చిత్రభానునిఁ గెల్చి ƒ చిత్రభానునదల్చి
తన విక్రమోన్నతి ƒ ఘనతఁ గాంచ
హరినందనుని మించి ƒ హరినందను హసించి
తన మోహనాకృతి ƒ ఘనతఁ గాంచ

తే. నందగోపాల వంశ రƒత్నాకరైక
పూర్ణచంద్రాయితాంగ విƒస్ఫూర్తి బొమ్మ
యావనీపాల రామానుƒజాంబికాత
నూజుఁడగు తిరువేంగడేంƒద్రుండు వెలయు. 20

సీ. తీఱక్కివ్యాజముల్ ఽ దీర్పింపఁగల యుక్తి
తీఱని తగవులఁ ఽ దీర్పుశక్తి
యెటువంటి దొరనైన ఽ నెంత నీ వను పదు
ఫ్రాంసుభాషను కథల్ ఽ పల్కుముద్దు
సమయోచితంబుగా ఽ సభలఁ బల్కెడు నేర్పు
హితుల నేరముల స ఽ హించునోర్పు
తనకుఁ బ్రియోక్తులం ఽ దఱుఁ బల్కఁ దగువీఁక
పురుషసింహ మనంగఁ ఽ బొసగుఁధాక

తే. గాంచి యిల జాతిదొరల మె ఽ ప్పించి మించి
కవులఁ దనియించి చుట్టాల ఽ గారవించి
నహితుల నణంచి దిక్కుల ఽ యశము నించి
ప్రబలు శ్రీతిరువేంగడ ఽ ప్రభుకిరీటి. 21

వ. ఇవ్విధంబున మహాయోగశాలియై 1ఫ్రాంసు 2హింగ్లీజు
3దినమార్గ 4యొలందాయం పరుదొరు (?) 5పురతకేజు
మొదలయిన యాయాజాతి 6పాదరులకుం దెలియని
గూఢార్థంబులఁ దెలియంజేసి, వారిచే మేలుమేలని పొగడి
కలుగాంచి యితరమతంబుల మర్మకర్మంబు లన్నియుఁ బరి
శీలించి జ్ఞాననిధులయిన సకల కలావల్లభులగు త్రోటరమల్లు
ప్రముఖులకు విశదపడని భావార్థంబుల మాటమాత్రంబున
నాటలవలెఁ దేటపఱిచి, బుద్ధిమూర్తిభవించినట్లు, ధైర్యం
బుసాక్షాత్కరించినట్లు, చాతుర్యంబు రూపంబు గైకొన్నట్లు
నీతి యాకృతిం దాల్చినట్లు తేజరిల్లి, పరేంగితజ్ఞానంబును,

1 French, 2 English, 3 Danish, 4 Dutch, 5 Portuguese, 6 Father.

దారతమ్య విమర్శనంబును, ఘటనాఘటన సామర్థ్యంబును, నుచితానుచిత కార్యవివేచనంబును గలిగి, యవ్యాజపరోపకారమూర్తియై దిగంతవిశ్రాంతకీర్తియై ప్రవర్తిల్లు నమ్మహాపురుషుని ప్రభఁజూచి సైరింపఁజాలక [1]ఫ్రాంసుకుంపిణీ కార్యధురంధరుండై [2]జనరాలు పట్టంబునం బూని దొరతనంబు సేయుముశియనే [3]జనరాలు కొన్నికుచోద్యంబులుసేసి నానాట హెచ్చుగా మచ్చరించిన నాజాడ తెలిసి యేవిధంబుననైన నితని మట్టువెట్టెదనని యెంతెయుం బంతగించి సీమకు సూత్రంబులు పన్ని లక్షాంతరంబులు కర్చుచేసి విస్తారంబుగా దస్తరంబులువ్రాయించి ఫ్రాంసురాజన్యున కాఁజనరాలు దుర్వ్యాపారంబు లెఱిఁగించి తత్‌క్షణంబున బదులు దొరను రప్పించి యాతనిచేత నాముశియనే యను వానిఁబట్టి కట్టించి కొట్టించి గిడ్డంగిన వేయించి తన మనంబునంగలచలంబంతెయుఁ దీర్చికొని పద్దుచెల్లించితివని యెల్లవారలుం గొనియాడఁ గుంపిణికి ముఖ్యమంత్రియై యవతారపురుషుం డనఁదగిన దొరచేత మెప్పులొందుచుఁ బెంపందినం జూచి నవాబులు సంస్థానపతులు సాటివారలు వర్తకులు నాశ్చర్యంబునం బొదలి యిట్లనిరి. 22

సీ. జాతి [4]కౌంసేలు మేజాపల్కపైఁ గొట్టి
లీల నేఘనుఁడు చెల్లించుకొనియె
సీమకట్టు ఫిరాదుచేసి దస్త్రాల్ వ్రాసి
యేతంత్రి [5]కప్తాను నెత్తిఁగొట్టె

---

1 France, 2 General, 3 Bussy, 4 Council, Captain.

వగఁ బ్రాంసుదొరలతోఁ । దగవుల కేర్పడి
యేనిటవరి నిర్వ । హించి మించెఁ
గరితోరు పట్నాలు । గలుగుమంత్రులలోనఁ
జెలఁగి యేమేటి ప్ర । సిద్ధిఁ గాంచె
తే. సకల భాషలు మాటాడఁ । జదువ వ్రాయ
నిపుణత వహించి యెవ్వాఁడు । నెగడె జగతి
నట్టి తిరువేంగళేంద్రు గు । ణాతిశయము
లెలమిఁ బన్నగపతికైన । నెన్న వశమె ! 23
సీ. ఏమంత్రి యుజ్జ్వల । శ్వేతాతపత్రంబు
పరితాపమును జేయుఁ । బగతురకును
నే జనపాలుని । తేజంబు చీఁకట్లు
గ్రమ్మించు రిపుకోటి । కన్నుఁగవల
కే నెఱయోధయౌ । దానఘనుం డధి
కము సేయు వైరిశో । కానలంబు
నే మంత్రి సత్కీర్తి । సోముఁ డింకించు ని
ర్ణిద్రారి సేనాస । ముద్రములను
తే. జగతి నే మేటి నెఱధాక । సాటియైన
మంత్రులకు గుండెగాలంబు । మాడ్కిఁ దనరు
నట్టి తిరువేంగడేంద్రుఁ । డీక్షైనయోధ
కలుగ నేర్చునె యుద్ధములో । కముల యందు. 24
క. అతని కులపాలికామణి
పతిభక్తివిశాల బంధు । పరిపాల యరుం
ధతిసదృశలీల బుధస
మ్మతసద్గుణ జాల లక్ష్మ । మాంబిక వెలయున్. 25

చ. సతిపతు లిద్దరెంతయును సంతతిగాంచు తలంపునన్ మహా
వ్రతములు దీర్థయాత్రలు దపంబులు బ్రాహ్మణపూజలున్శివా
యతనిలయంబులున్ వనచయంబులు సత్రముల గ్రహారముల్
వితతతటాకపాళి చలివెందర లచ్చుపుభక్తి సేయగన్. 26

వ. ఇవ్విధంబున నవ్వధూవరులు సుపుత్రులం బడయుటకై కా
వించు పూజల శ్రీకృష్ణమూర్తి సంతసిల్లి తొల్లి నందునికా
తని కులంబున నవతరించెద నని వరం బొసంగినవిధంబు
తలంచి యీతిరువేంగడనాథునకు లక్ష్మమాంబికకుం గూర్మి
నందనుండనై యుద్భవింతుంగాక యని నిశ్చయించి. 27

మ. క్షితిలోఁ గోసలరాజవర్యసుతకున్ శ్రీరాముఁడ్డా పార్వతీ
సతికిన్ శక్తిధరుండు గల్గుగతిఁ గృష్ణస్వామి విఖ్యాతిగా
నతులప్రౌఢిని లక్ష్మమాంబసుతుఁడై యానందరంగక్షమా
పతిచంద్రుండన నుద్భవించెను గళాభాగప్రపూర్ణాకృతిన్.

క. అతనికి సహోదరుండై
మతి ధృతివితరణ కళాచమత్కారమహో
న్నతుఁడు తిరువేంగడ మహా
పతి యుద్భవమై చెలంగె బాలార్కాకృతిన్. 29

సీ. ధైర్యంబు సంతతౌదార్యంబు శౌర్యంబు
గాంభీర్య చాతుర్యకౌశలములు
మతిశక్తి ఘనయుక్తిమధురోక్తి పితృభక్తి
యుచితజ్ఞతయు నీవి యొర్పు నేర్పు
దాక్షిణ్యమును జల్లఁదనము చక్కదనంబు
రసికత యాశ్రితరక్షకతయుఁ

దారతమ్యప్రౌఢితంత్రంబు శీలంబు
సత్యవాక్యోన్నతి చలము బలము
తే. సుగుణతోఁ బాలతోఁ దల్లి యొనరఁ గూర్చి
ప్రేమ నల్లారు ముద్దుగాఁ బెంచినట్టు
లఖిల సుగుణాభిరాముఁ డై యనుదినంబుఁ
బ్రబలె నానందరంగ భూపతి కిరీటి. 30
చ. తెలివికిఁ బుట్టినిల్లు జగతీశుల కెల్లను మేలుబంతి వి
ద్యల కొఱగల్లు తాలిమికిఁ దావు వదాన్యతకున్ నిధానమా
ప్తులకును మెట్టపంట కవిభూసురవాటికిఁ గల్పవాటి యై
కలియుగకృష్ణమూర్తి యనఁగాంచెను రంగవిభుండు కీర్తులన్.
శా. అంతన్ జెంగలుపట్టునం దనరు శేషాద్రీంద్రు సత్పుత్రి యా
కాంతారత్నము రూపవిభ్రమకళాకారుణ్యదాక్షిణ్యవి
శ్రాంతిన్ లక్ష్మి నిమించుసద్గుణసమాజన్ మంగతాయీసతిన్
సంతోసంబునఁ బెండ్లియాడె విభవైశ్వర్యంబులుప్పొంగగన్.
సీ. కన్నులా చిన్నారి పొన్నారికి బిడారు
చూపులా కరుణకుఁ బ్రాపుదాఁపు
బలుకులా సత్యసంపదలకుఁ బుట్టిల్లు
గుణములా యమృతానకు నిలయంబు
వితరణమా సదావిశ్వవిఖ్యాతంబు
శీలమా లోక ప్రసిద్ధికరము
చిత్తమా బహుధర్మచింతనాయత్తంబు
పుణ్యమా సౌజన్యమునకుఁ దావు
తే. నగుచు నే సతీమణికిఁ జెన్నలరు నట్టి
శ్రీమ దలమేలుమంగమ్మ చేయివట్టి

నది మొదలు ప్రాజ్యసామ్రాజ్యపదవి రంగ
భూపతికి నాఁడునాఁటి ఉప్పొంగఁ దొడఁగె.

వ. అంత.

గీ. సీమలోనుండి ఫ్రాన్సురాట్ఛేఖరుండు
పసిఁడిబెత్తంబు భూషణాంబరము లనిచి
కుంపిణి దుబాసితన మీయ సొంపుగులికి
రహిఁ జెలఁగ మీఱె నానందరంగశౌరి.

క. ఆవిజయరంగ రాయును
ధీవరు సహజన్ములైన తిరువేంగడగో
త్రావిభుఁడు నాఁడునాఁటికిఁ
బూవులచే రెత్తినటులఁ బొసఁగి వెలింగెన్.

వ. తదనంతరంబ.

గీ. రాయసింహాసనాసీన రంగపతికి
శ్రీమదలమేలుమంగాసతీమణికి ది
నప్రవృద్ధి ముద్దు విజయానందరంగ
చంద్రుఁ డుదయించె సత్కళాసాంద్రుఁ డగుచు.

సీ. ప్రభవమొందిననాఁడె ఫ్రాంసురాజేంద్రుండు,
బహుమానములఁ జాలఁ బనిచినదియుఁ
బలుకనేర్చిననాఁడె పాచ్ఛాయి మొదలైన
ప్రభువులు భృత్యులై పరగినదియు
నడువనేర్చిననాఁడె కడిమిసీమను సుబా
దొరతనంబు వహించి మెఱసినదియు
నాడ నేర్చిన నాఁడె యఖిల భూపతులచేఁ
గానుకల్ గప్పముల్ కాంచినదియుఁ

పవ నేర్చిననాఁడె కె విస్తారముండ
ధిపత్యంబుఁ బూని చెలంగి నదియు
వకులజ ముద్దువిజయానందరంగ
నతికే కాక కలుగునే యితరులకును ? 39

న్నమ్మద్ది విజయానందరంగ నృపాలుండు బాలగోపాల
- త్రివలె ముద్దుగుల్కుచు, సేతుహిమాచలాంతరధరా
యంబంతయు నేకచ్ఛత్రాధిపత్యంబుగా నేలుచు రాయ
హాసనాసీనుం డగుటంజేసి ప్రబలుం డగుటయు నయ్యు
రంబున. 40

న్నహిఁ బ్రబలిన ఢిల్లీదు
మ్మదుషా ఫాదుషా ధరారాధీశ్వరు హు
-మ్మను నాజరుజంగును
మ్మనఁ జేకొనక మెలఁగెనట విని కినుకన్. 4

ఁగ నాజరుజంగుసత్వ మ్మడంచి
ఁ దక్షిణసుబ గట్టుకొ మ్మటంచు
హిరాయమొహాదీనుఖాను నపుడు
దుషా పంప నతఁడు దోర్బలము మెఱయ. 42

-ర వరూధినీసమేతుం డై బహుదూరంబు గడచివచ్చి
సురాజు సహాయంబువడసినం గార్యసిద్ధిసులభంబగునను
వునఁబుదుచ్చేరికుంపినికిం గార్యస్వతంత్రియుఁదండ్రియు
త్రియు నైనముద్దు విజయానందరంగనృపాలునకుం గాగి
యువ్రాసిన నాతండత్తెఱఁగంతయు దొరయైనదూప్లెక్సు
-రాజున కెఱింగించి పరమప్రయత్నంబున నతనిసమ్మతిలం
విజతంత్రశక్తివలన సాతారానగరమున జెఱంబడియున్న

ఛందాసాహేబు న్విడిపించి మొహదీను ఖానునకుంఱతచేసి పుదుచ్చేరినున్న రజాసాహేబునకు నవాబుతనం బిప్పించి యతని వెనువెంట విక్రమ విక్రమార్కులగు ఫ్రాన్స సోల్జరులను నసహాయ శూరులగు బారుసిపాయీలనుం గూర్చిన నాచజాసాహేబును, చందాసాహేబును హిరాయిక మొహదీను ఖానుండును నేకస్థులై ఫ్రాన్స ఫౌజును మున్నిడుకొని, అనవరుద్దీను ఖానును నతని ఫౌజును నిమేషమాత్రంబున ముంచి; యార్కాడు నాక్రమించి, యటువెన్క మధుర, తంజావురి, మైసూరు, ఇక్కేరి మొదలైన సంస్థానంబుల నిట్టట్టు గావించి;

తత్సమయంబున లక్షగుఱ్ఱంబులతోఁ దమపై దండెత్తి వచ్చి పుదవాపురి నాక్రమించుకొనిన నాజరుజంగు నా నెట్టున నిలువనీయక తలుముఁగొట్టి గులాం నహుషు మహమ్మదు ఖానుని దండంతయుఁ జూఱలాడించి, తురకతమాషుఖానుని నిర్నామంబు గావించి, నలుసింగుఖానుని దండంత జూఱలాడించి, మహమ్మదు అబరాల్ పాళయం బంతయు నెత్తి గొట్టించి, మహమ్మదల్లి ఖానుని పౌజంతయుఁ బటాపంచలై పాఱందఱిమి, మఱియునుంగలుగు వీరాధివీరుల నెచ్చటను నఱకా లూఁద నీక చెల్లాచెదరు గావించి, పరాక్రమించిన నట్టియెడ నాహిరాయత మొహదీనుఖానుఁడు నాజరు జంగు దళంబునం జొచ్చి పీనుంగుపెంటలు గావించి పేర్చియార్చి యపగడంబుగా వారిచేఁ బట్టువడిన నాసుద్ది విని కిట్టుల్కురెట్టింప సామాద్యుపాయభేదంబులం దంత్రంబులం బన్ని యన్నాజరుజంగుం ద్రుంగడంగించి, వారి

ద్ధండంతయుఁ జూఱలాడించి యెప్పటియట్ల హిరాయతు మొహదీనుఖానుని నిజాము పట్టణంబునం బ్రతిష్ఠించి యత నివలన వజాయురాయఁ డనుబిరుదుపేరును జెంగలిపట్టు జిల్లా జాగీరునుం గుమారశేఖరుండైన ముద్దువిజయానంద రంగరాయాగ్రణిపేర మూఁడువేల గుఱ్ఱంబులకు మనసుబా దారతనంబును నవపత్తుమాయి మురాతఁబు మొదలైన మహారాజలాంఛనంబులుం గైకొని దొరయైన దూప్లెక్సు రాజేంద్రునిచేతను నానబాబునిజాములచేతను ననేక స్తోత్రంబులం బడసి యపారంబైన కీర్తింగాంచిన సకలదేశా ధీశు లానందకందళిత హృదయారవిందు లై. 43

సీ. సాతారలో నున్న ఛందసాహేబును
జెఱఁబాపి పిలిపించు నెఱతనంబు
ధృతి హిరాయిత మొహదీన్ ఖాను జతఁజేసి
యనవర్దిఖానుఁ గొట్టిన చలంబు
హెచ్చుగా దండెత్తి వచ్చిన నాజరు
జంగును దునిమిన సాహసంబు
నార్కాడు మొదలైన యట్టి కర్ణాటక
సుబకు నబాబుఁగాఁ బ్రబలు శక్తి
తే. ఢాకగాఁ గృష్ణహద్దు కన్యాకుమారి
దాఁకఁ గలిగినదేశ మంతయును గట్టి
నట్టిసామర్థ్యము విజయానందరంగ
ఘనునకే గాక యొరులకుఁ గలదె ధరను? 44

సీ. తనరాక విన్నమాత్రమున బల్లిదుఁడైన
ఢిల్లిపాచ్ఛా గుండె తల్లడిల్ల

తనఘాటి విన్నయంతనె జయసింగును
భయపడి కాన్క కప్పము లొసంగఁ
దనపేరు విన్నంత దద్దరిల్లి నిజాము
ఫౌఁజు చీకాకుఁగా బరువులెత్తఁ
దనయాజ్ఞ బలు సుబేదారులు నితరదే
శాధినాథులు శిరసావహింప
తే. జగతిఁ బొంపొంద నాజరుజంగువంటి
వాని నవలీలఁ దెగటార్చి వన్నెవాసి
చెందినవజారత విజయానందరంగ
ఘనుని దృష్టికి నెవ్వరైనఁగాని యెదురె.?
సీ. ఏఘను జయభేరి కాఘనధ్వని విన్నఁ
బరరాజహంసలు పరువులెత్తు
నేనరేంద్రుని ధాటి నీక్షించినంతనే
భోగికులంబులు పుట్టలెక్కు
నేరాజుతేజంబు నిసుమంత విన్నంత
శత్రుచక్రంబులు సంచలించు
నే నృపకేసరి హెచ్చుఘాటను విన్న
వైరికుంజరపాళి పూరిఁ గఱచు
తే. నట్టి యానందరంగధరాధినాథు
బలపరాక్రమవైఖరిఁ బ్రస్తుతింప
వశమె మహిలోన మనవంటివారి కంచుఁ
బొగడుచును దమతమదేశములకుఁ జనిరి.

---

# కృష్ణరాయల దిగ్విజయము.



మ. పురసంరక్షణదక్షులౌ జనులకున్ బుద్ధిస్థితుల్ దెల్పి భూ
సురసందర్శిత దివ్యలగ్నమహిమన్ బొల్పొందనందంబుతో
స్థిరశౌర్యోన్నతి జృంభమాణగరిమన్ దిగ్జైత్రయాత్రామతిన్
వెరవొప్పన్ బురిచెంతలన్వెలిగు డార్వేయుఁగఁ బంచెన్వేసన్.

ఉ. పంచి సమంచితస్థితి సభాసదులన్ విలసత్కృపన్ విలో
కించి ధరాసురేంద్రులకుఁ గీర్తి చెలంగ సమస్తవస్తువుల్
మించిన వేడ్కదానము లమేయగతిన్ ఘటియించి విస్ఫుర
త్కాంచన భూషణావళిఁ దద్ద్యుతిరంజిత దివ్యమూర్తినిన్. 2

చ. వరమతి సద్గుణప్రకట వైభవ నిర్జితశారదాంబయై
తిరుమలదేవి కప్పురపుదీవెన వీడెమొసంగి పంపఁగా
నరవరమౌళి దివ్యశకునమ్ములు గన్పడ భద్రదంతి పై
సరగున నెక్కి ఛత్రమును చామరముల్ మెఱయంగ నెంతయున్.

సీ. అనవద్య చిత్రవాద్యస్వనంబులతోడ
భేరీ విరావముల్ బోరుకలఁగ
గంధేభ ఘీంకారఘనతరధ్వనితోడఁ
దురగ హేషారవస్ఫురణ మెనయ
వరభూసురాశీరవ ప్రభావముతోడ
వంది మాగధ శబ్దబృంద మొనర
సకలాభరణ పంక్తి చకచకద్యుతితోడ
సురుచిరాయుధదీప్తి సొబగు మీఱ

తే. సరస మన్నీలు దుముదార్లు ǂ చతురవితత
సకలసేనా సమేతులై ǂ సంనడింప
రమణఁ జెలువందు రాజమార్గమున వచ్చె
రమ్యగుణశాలి శ్రీకృష్ణరాయ మౌళి.

తే. అతని మహిమకుఁ జాల నద్భుతము నొంది
విరులవానలు గురియించు ǂ వేల్పులనఁగ
విమలసౌధాగ్రములనుండి ǂ వేడుకలర
సేసజల్లిరి పురిలోని ǂ చెలువ లపుడు.

క. ఇటువలెఁ బురంబు వెలువడి
కటకగృహమున నిలిచి ఘనశుభప్రదవేళన్
జటుల చతురంగసేనా
ర్భటులెసఁగన్ నడచె దిశలఁ ǂ బ్రతిరవ మడరన్.

మ. చని ప్రాగ్దక్షిణపశ్చిమోత్తర విదిగ్జాలంబునన్ వైరిక్ష్మా
ర నృపాలాననిఁ జుట్టుముట్టుకొని యారాజ్యంబునంగల్గు
ధనముల్లుందడిఁ మూఁకలాఁగుటయు మార్గద్వల్లీలతో సర
న్య నిరూఢిందదధీశులెంతయును జగన్యప్రౌఢిమన్ గ్రమ్మఁ

సీ. రటితదిక్తటనటత్పట పెటార్భటులతో
ఘోరమైన తుపాకి ǂ గుండ్లచేత
దవ్వుదవ్వున హెచ్చి ǂ తివ్వుతివ్వునవచ్చి
ప్రసరించు రాచూరి ǂ బాణములను
పెల్లుగా వెసఁ జిత్తజల్లుగా వెదఁజల్లు
పెంపరుల్ పెంపారు ǂ సంపగముల
ధాటీగతి నటింప ǂ మాటికి సూటిగా
నాటెడు బల్లెంపు ǂ టేఁకెగముల

తే. నఱిమిఱిఱిమిన భయమున । విఱిగి జరిగి
నిజబలంబుల ధాకకు । నిల్వకరులు
శరణుఁ జొచ్చిన వారలఁ । గరుణఁ జూచి
యచటి దుర్గస్థలంబుల । నాక్రమించె. ౮

వ. అనంతరం బొక్కహుమ్మత్తున నుమ్మత్తూరు శివసముద్ర స్థలంబుల నెపంగు గంగరాజు నొడయలనోడించి శ్రీరంగ పట్టణంబు నిరీక్షించి పరాక్రమక్రీడలు గ్రక్కదల నక్కడి సంకుల నాయకునిం గటాక్షించి చంచత్ప్రతాపంబున విజాపురంబుగడి దుర్గంబు చాయం జనుదెంచు సమయంబున. ౯

ఉ. శ్రీరంజెలంగు నానృపతిశేఖరుదాటికి నిల్వ కెంతయున్
జాలిరిఁబొంది యచ్చటి రసాతల నాయకులాత్మలన్ మహా
దోళనమంది కోటలును దుర్గములంగయికొమ్మటంచు ను
ద్వేలభయంబునన్ శరణువేడుచుఁగానుకలిచ్చిమ్రొక్కనన్.

క. శరణాగత రక్షణమున
బిరుదాంకుఁ డతండు వారిఁ । బ్రేమం గనుచున్
గరుణించి తత్పురంబుల
నెఱయం దనబలము లుంచె । నిండిన వేడ్కన్. 11

వ. ఇవ్విధంబునఁ బ్రతిదినప్రవర్ధమాన శౌర్యధైర్యధుర్యుండగు నమ్మహీమండలాఖండలుండు తొంటి రఘుమహారాజు చందంబున నిఖిల రాజులుందనకు హస్తగతంబులు సేయ నాదవని, ముదుగల్లు, రాచూరు మొదలైన మహాస్థలంబుల నిజబలంబులుంచి మించిగోలకొండపురంబుపై నో

నాఁ దుద్దండ వేదండ కాండ భటప్రకాం
నవసరంబున.

ఉ. ఆగజవాజిబృందములకాభటకోటుల
హాగురుశౌర్యధైర్యములకాత్మఁగలం
హాగణుతింపశక్యమె యాహర్నిశము
య్యాగరనాముదానగరియందువిజా

తే. లక్షగుఱ్ఱంబుతోడను లక్షణంబు
మెఱయ బీరానమూఁ డిండ్ల తురక
కృష్ణవేణికినీవలఁ గృష్ణరాయ
నృపుల కెదురుగఁ జనుదెంచి నిలి

చ. నిలిచినవార్త వేఁగరులు నిక్కముగాఁ
జెలఁగి భళీ తురుష్కతతి జెంతకుఁ
కలఁగి తొలంగిపోయెదరుగాక మదీ
నిలువఁగనేర్తురేయనుచు నిశ్చలధైర్య

తే. అపుడు కొలువయి కొలిచిన యమ
కులను మన్నీల నందఱఁ బిలువఁ బ
సకల బహుమానములొసర్చి జనవ
డల్ల తురకల వృత్తాంత మెల్లఁ దె

తే. అపుడు సభలోనఁ గలిగిన యఖిల
వరులు మన్నీలు మిగుల నద్భుతము
ఘనతరస్థైర్యధైర్యముల్ గానఁబడఁ
బల్కి రెంతయు సంతోషభరితు ల

క. అనృపమణి పర్యంతము
రాసిత్తుమె శౌర్యమహిమ రంజిల ని

పూని విరోధుల గెల్తు మ
నూనపరాక్రమధురీణ యుర్వీరమణా ! 18

వ. అని పల్కుచు మహాసంరంభంబున శత్రుసైన్యంబుల
పయిం దారసిల్లి. 19

సీ. నడయాడు కొండల వడువున వేదండ
తండంబు లొండొండ మెండుకొనఁగఁ
గడలి తరంగల బెడఁగారు చందానఁ
గాండప్రకాండముల్ గడునటింప
పెదురుగుంపులు వెల్లి విరిసిన ట్లేతెంచె
ననఁగ బల్లెము లీఁటె లతిశయింప
నంచ లంబరమున మించిన ట్లంచిత
చ్ఛత్రచామరసిత చ్ఛాయ లలర

తే. ఘంటికాకింకిణీఘణంఘణవిరావ
భూరి భేరీరవంబులు బోరుకలగ
రాయ బలములు గవిసె గుఱ్ఱపు దొరల
ఫౌజుపై దేవగణములు ప్రస్తుతింప. 20

వ. ఇట్లు తారొ్కని యొండొరుల మారొ్కని తమతమ దొరల
నామాంకంబు లగు బిరుదులు పేరొ్కని తొలుదొల్త
యులబలంబు లెసంగఁ దుపాకుల పెళపెళలు, పెట్లుగ్రోవుల
పెటపెటలు, జబురుజంగుల ఫిరంగుల ధమధమలు, ధమా
మీలధమధమలు, బాణంపుఁ జిచ్చుల చిఱచిఱలు, బాణం
బుల జిఱజిఱలు, మనంబులంబట్టు చిఱచిఱలు, శింజినీటం
కారంబులు పరస్పరహుంకారంబులు నన్యోన్యపురస్కర
ణంబులు, నితరేతర తిరస్కరణంబులు, వివిధరోషణంబులు,

నెఱయ ఖడ్గాఖడ్గి దండాదండి బాహాబాహిం దాఁకుచ
బెనఁగుచుఁ బాయుచుఁ గ్రమ్ముచు డాయుచు నడచుచ
గ్రుమ్మచుఁ జిమ్ముచు జిమ్ముచు నెట్టుచు వచ్చవల మెచ్చు
హెచ్చుచుం జొచ్చుచు నీటెలం గ్రుచ్చుచు బల్లెంబులఁ
మ్మచు కేడెంబులం బమ్మచు శిలల ఱువ్వుచుఁ గెఱ
నవ్వుచు తేజీల నడచుచు నేజాలఁ గెడపుచు లకోరీలఁ దు
ముచుఁ గొండొక నేపు రెండుబలంబులం గన్నులపండువు
చండశౌర్యంబులు వెలయ భండనం బొనర్చ నెడం ద
బడక యొక్కుమొగి తురుష్కులుఖానుష్కకౌశలంబడ
జనుదెంచు రయంబుఁ గన్గొని సంరంభంబునం బెమ్మసా
రామలింగనృపాలుండు  కృష్ణరాయక్షమాకాంతున
ట్లనియె.

పంచచామరము. పరాకురాకు రాకుమం దుఁగ్రాబారసీకభూపతుఁ
చిరాకు మీఱ దట్టమైన సింగిణీలకోరులన్
జిఱాగుఱాలవేసి డాసి చిల్లుపాల్లుసేయుచున్
నిరాకరించి మించివచ్చె నేర్పుఁజూఁడితే నృపా!

ఉ. పంతముతోఁ హుటాహుటిని బాజులలోపలఁ జొచ్చి సైన్యవి
తింతలుగాఁగ ఖడ్గహతిఁ ద్రెంచెదఁ దేరిజత్రాళ్లు మీఱలీ
చెంత నెయుండి కన్గొనుఁడు శీఘ్రముగాఁ బరివీరరాజుల
దుంతపయూళికానిపురిఁ ద్రోచెదఁ జండపరాక్రమోన్నతి

క. మీఱాసమయంబున జయ
భేరీరావములు చెలఁగఁ బ్రభృతర సైన్య
శ్రీ రాజిలఁ దఱిమినచో
జేరరె తమోనుకరులు చెల్లాచెదరై.

ము. అనుచుం బల్లెము కేలఁ బూనుకొని శౌర్యారూఢులౌ కమ్మవా
ర్వేను వెంటన్ బది వేలు బల్లెములతో విఖ్యాత శౌర్యోన్నతిన్
జను దేరన్ ఘనసింహనాదములరన్ దత్సైన్యముం జొచ్చి హె
చ్చిన ధైర్యంబునఁ బారసీకతతులం జెండాడె నుద్దండుఁడై.

ము. మొనకున్ వచ్చిన విచ్చుకత్తుల సివేయము స్త్రీదు మేల్ రౌతులన్
ఘనమాడంగను గల్గి పార్శ్వములయం దుంగ్రమ్ము నశ్వమ్ముల
న్దనబల్లెమ్ముల గ్రుమ్మి క్రుమ్మి యుచు వేన్కన్ దారసిల్ జోదులన్
గనిదూరంబు దొలంగఁ జేయుఁ బటుదోర్గర్వంబ ఖర్వంబుగన్.

క. ఆదండధరుఁ డటంచున్
గోదండధరుల్ గలంగఁ గుటిలారిమహా
వేదండతతులఁ గూల్చెన్
వేదండనిజాస్త్రవృత్తులు వేడుకఁ జెందన్. 27

క. ఘనశరతతులం దనసా
ధనగతుల న్వేసరి, రిపులు తల్లడిలఁగ హా
త్తీనరయమునఁ దఱుముచుఁ గ
త్తినతఁడు దేరిజవుఁ బ్రాభ్యు తెగఁ గోసి వెసన్. 23

వ. అట్టహాసంబు చేయు నతని బెట్టిదంపు దిట్టతనంబునకు గుట్టుసెడి యరిసైన్యంబులు తట్టుంబడినపులుఁగులగతిం గొట్టుమిట్టాడి తెఱలఁ జూచుసమయంబునఁ గృష్ణరాయధరానాయకహరినాయకుండు చండశౌర్యంబున నుద్దండ వేదండ సమారూఢుండగుచు శుభయచామరచ్ఛత్రమరకతకేతన ప్రభలు వెలయ నఱువదేనువేలగుఱ్ఱంబులు నాఱులక్షల పదాదివర్గంబు నిన్నూరుఘటంబులయేనుంగుల్లుం గొలువ నొక్కనిబ్బరంబున సింహనాదంబులు రోదోంతరంబులు

మ. అనుచుం బల్లెము కేలఁ బూనుకొని శౌర్యారూఢులౌ కమ్మవా
ర్వేను వెంటన్ బది వేలు బల్లెములతో విఖ్యాత శౌర్యోన్నతిన్
జను దేరన్ ఘనసింహనాదములరన్ దత్సైన్యముం జొచ్చి హె
చ్చిన ధైర్యంబునఁ బారసీకతతులం జెండాడె నుద్దండుఁడై.

మ. మొనకున్ వచ్చిన విచ్చుకత్తులసి వేయము స్తీదు మేల్ రాతులన్
ఘనమాడంగను గల్గి పార్శ్వములయందుం గ్రమ్మ నశ్వమ్ముల
స్తనబల్లెమ్ములఁ గ్రుమ్మి క్రమ్మఱుచు వేన్కన్ దారసిల్ జోదులన్
గనిదూరంబు దొలంగఁ జేయుచు బెదోర్గర్వంబు ఖర్వంబుగన్.

క. ఆదండధరుఁ డటంచున్
కోదండధరు ల్గలంగఁ గుటిలారిమహా
వేదండతతులఁ గూల్చెన్
వేదండనిజాప్తనృపులు వేడుకఁ జెందన్. 27

క. ఘనశరతతులం దనసా
ధనగతుల న్వైరి, రిపులు తల్లడిలఁగ హా
త్తీనరయమునఁ దఱుముచుఁ గ
త్తి నతఁడు దేరిజపుఁ ద్రాళ్ళు తెగఁ గోసి వెసన్. 28

వ. అట్టహాసంబు చేయు నతని బెట్టిదంపు దిట్టతనంబునకు గుట్టు సెడి యరిసైన్యంబులు తట్టుంబడి నపులుఁగులగతిం గొట్టుమిట్టాడి తెఱలం జూచు సమయంబునఁ గృష్ణరాయధరానాయకహరినాయకుండు చండశౌర్యంబున నుద్దండవేదండసమారూఢుండగుచు నుభయచామరచ్ఛత్రమరకతకేతనప్రభలు వెలయ నఱువదేనువేలగుఱ్ఱంబులు నాఱులక్షలపదాదివర్గంబు నిన్నూరు ఘటంబులయేనుంగుల్లుం గొలువ నొక్కనిబ్బరంబున సింహనాదంబులు రోదోంతరంబులు

నిండం దళుముచు జయభేరికాతాడనంబు గావింప నిరె
గించిన.

మ. జలధుల్ ఘూర్ణిలెదిక్కరుల్ జెదరెఁ జాంచల్యంబునొందెన
స్థలిధాత్రీధరసంఘముల్ గదలెఁ బాతాళంబు స్వర్లోకమ
గలఁగెన్ శత్రుభయంకరప్రకటదోర్గర్వస్ఫురత్కృష్ణరా
యలసద్భేరిధణంధణస్వనము లాశాంతంబులంబర్వగన్.

తే. అతుల జయభేరికారవం బతిశయింపఁ
జెలఁగి చనుదెంచు నతనికో త్తలకుఁ గాఁగఁ
జెదరి బెదరి కలంగి కన్ జెదరి తూలఁగి
గచ్చువిచ్చయ్యెఁ బారసీ కవ్రజంబు.

వ. అయ్యవసరంబున.

ఉ. వాహినిఁగూర్చి నీవు శరపాళి విరోధుల ముంచితో నృ
వాహినులందు నెన్నఁదగువాహినిఁగానె భవత్సహాయ
యూహారులన్ శరార్తినలయించెదఁ జూడుమటంచు నెంచె
నా హరినీల నీలసలిలావృతిఁ గృష్ణయునింకెనెంతయున్.

క. కొందలము మిగుల మదిలో
నాందోళన మంది శత్రు లకట ఖోదా నే
మందము నీమలకుం జను
టందము గా కిచట నిల్వ నగునే మనకున్.

ఆ. ఎందుఁ జనఁగరాని యిక్కట్టు ప్రాపించెఁ
గృష్ణరాఁ దొడంగెఁ గృష్ణరాయ
లివలఁ దఱుమఁ జొచ్చె నెంతయు వెఱపింపఁ
బోయి వెఱచుకొన్న చాయ యయ్యె.

తే. పదరి కృష్ణదాటి పదపద మని వచ్చి
యొక్క మన్నవాని కోర్వలేక
తిరిగినట్టు లయ్యెఁ దెలియంగ రాయల
యెదుటఁబడిన రిపులు బ్రదుకఁ గలరె? 36

తే. వెనుకముందైన యంతనే వెనుకముందు
తోఁచకున్నది నదిదాఁటి త్రోలఁగు టటిది
యనుచు మంత్రులుందారు నన్యోన్యచింత
నాత్మలోఁగుంది కడలేని యార్తిఁజెందె. 37

వ. యథాయథలై మదహయగజాదుల నటుఁబెట్టి యొక్క
యుదుటున నది నుఱికి దాఁటుటయు. 38

తే. అతుల జయలక్ష్మిఁ గైకొని హారులఁ గరులఁ
బరులధనపంక్తులను దనవశముచేసి
వెలయు శ్రీకృష్ణరాయల విభవగరిమఁ
గాంచి కన్నులపండువు గాఁగ నపుడు. 39

తే. సరససాహిత్యరచన విస్ఫురణ మెనయ
చేరి వినుతింప మాదయగారి మల్ల
నార్యుఁ డల యలసాని పెద్దార్యవరుఁడు
ముక్కుతిమ్మన మొదలైన ముఖ్యకవులు. 40

వ. అటుఁగదలి యవ్వల దుర్గమంబగు నుదయగిరిదుర్గంబు
సాధింపం దలంచునెడ నగ్గజపతిసీమం జూడఁబోయిన చారు
లరుదెంచి ప్రణతు లగుచు. 41

చ. జయజయకృష్ణరాయనృపచంద్రపురందరభోగసాంద్ర మీ
దయను గళింగదేశ వసుధాపతివర్తనమెంతయుఁ మహా

రయమునఁ గాంచి వచ్చితిమి రాజవరేణ్యుఁ డతండు సంతత
ప్రియకరుఁడాశ్రితావనగరిష్ఠగుణాభరణుండు చూడఁగన్.

సీ. కుంద బృంద నవారవిందముల్ జెన్నొంది
యుంద మా పొందళ్ళ చందువాలు
పచ్చడాల్ హెచ్చు రాగచ్చు రాణించుడాల్
ముచ్చటల్ మించు మేల్ మచ్చగములు
కల్వరా చెల్వు రావిల్వ రాణించుఁ గ్రొం
జల్వ రాజిలు గొప్పచప్పరములు
నిందిరా మందిరానంద రాజన్మహా
మందరాదిక గృహాళిందములును

తే. నెందుఁ గనుఁగొన్నఁ గన్నులవిం దొనర్చు
సౌర గోదావరీ వారిపూరవర్ధి
తామితారామ సర్వసస్యాభిరామ
నవ్యగుణధామ యాజగన్నాథపేమ. 43

గీ. అల జగన్నాథుని ప్రసాద మఖిల జనులు
స్పృష్ట దోషంబు లేక భుజింపవలయు
సన్మహా వైభవంబు బ్రహ్మాదులకును
సన్నుతింపంగ శక్యమే సార్వభౌమ! 44

ఉ. ధీయుతుఁ డాముకుందగజదేవు నిరంతర మెంతయున్ జగ
న్నాయకుల న్భజింపుచు జనంబులఁ బ్రోచుచు ఖండకీర్తితో
నాయత సౌధమంటపమునందు నిజాశ్రితులెల్లఁ గొల్వఁగా
శ్రీయలరంగ సింహమణిచిహ్నితపీఠమునన్ వసించెడున్.

శా. భూనాథోత్తమ యొక్కవింతగలదా భూవర్త గోదావరీ
స్నానార్థంబరుదెంచు వేగుఁ గని కొండంగల్గుపాశ్చాత్యులీ

రానీకంబులు చుట్టిముట్టుటయు శౌర్యస్ఫూర్తి శోభిల్ల వే
గానన్నల్వురుక్షత్రియుల్ కడఁగి వీఁకం గూల్చిరమ్మూఁకలన్.
మ. అదియుంగాక మహావిచిత్రములు దేవా యొక్క పాత్రుండు బె
ట్టిదమౌ ఖడ్గహతిన్ మహీరుహముఁ ఖండించెన్ మహాద్ధత్యసం
పద ఘోటిం దుమికించె నొక్కఁడు ఘనారంభస్సేతుమధ్యోర్వినా
సదయుండెంతయు మెచ్చి వారికొసఁగెన్ సద్భూషణవ్రాతముల్.
తే. అలపదార్గురు రాజులేరయిలను వేడ్క
నిట్టిక్షత్రియపాత్రులై పుట్టిరొక్క
కా దనిన నింత దోస్సారగరిమ గలదె?
కృష్ణరాయక్షితీంద్ర సత్కీర్తిసాంద్ర! 48
ఆ.- విన్న కన్న కొన్ని వింత లెంతయు మీకుఁ
దెలుపవలయు, గాని తేట పడఁగ
విన్నవించినార మిన్ని యాకర్ణించి
కొంచె మనక చిత్తగింపవలయు. 49
వ. అని యివ్విధంబునం దెలుపు చారులవాక్యంబులు విని య
ద్భుతంబున నమ్మహీరమణుండు బహుమానం బొనరించి
కతిపయప్రయాణంబుల నగ్గజపతి పాలనంబుననుండు నుద
యగిరిప్రాంతంబు సేరి. 50

కృష్ణరాయల యుదయగిరి ముట్టడి.

తే. తనప్రతాప ప్రకాశంబు దనర బంధు
జనమనఃపద్మనికరరంజన మెలర్ప
నహిత కువలయవరగర్వ మణఁగ నుదయ
గిరికి వేవేగ నయ్యినుం డరుగుదెంచె. 51

క. వచ్చి చతురంగ బలములు
విచ్చలవిడి నాల్గు దిశల వెలయఁగ నిలిచెన్
మెచ్చులరఁగఁ దనమహిమ వి
యచ్చరు లచ్చెరువుతోడ నభినుతి సేయన్.

సీ. ఏచాయఁ గనుఁగొన్న హేరాళమై తోఁచు
గంధాంధ సింహాళి గజచయాళి
యేవంక నీక్షింప హేషారవో దీర్ణ
గాంధార కాంభోజ కాండ వితతి
యేదారిఁ జూచిన నాదారిన తుపాకి
బలువైన జబురు జంగులు ఫిరంగు
లేదండ గణుతింప వేదండ కరచండ
కోదండ ధరభట కోటిపటలి

తే. యెచటఁ జూచిన బల్లెంబు లీఁటెగములు
గలుగురాయల దళ మెల్లఁ గలయఁ గాంచి
యుదయగిరిచెంత నుదయించె నొక్కవింత
యనుచు దుర్గములో మంది యలుకుఁ జెంది.

క. అభిమానమునకుఁ గాన
య్యిభరాజు జనంబుబోరె నెంతయు బాహా
విభవం బెలర్ప సేనా
రభసమ్మున కెదరికృష్ణరాయలతోడన్.

క. దుర్గమ మగు నాదుర్గమ
నర్గళగతిఁ దీయఁ గృష్ణనాసీకములున్
దోర్గర్వమునన్ నానా
మార్గంబులఁ బోరి రపుడు మాద్యద్గతులన్.

సీ. కోటలు దుర్గముల్ గొనుచు దోఃపటులీల
ధాటిచే మించు నార్వీటివారు
కంటకాహిత కంఠకలుంఠనోద్ధతలీల
దంటలై తగు తోరగంటివారు
నిబ్బరంబుగ శత్రునికరంబు నఱగించి
ధీరులై మించు గోబ్బూరివారు
చాల దోర్బలలీల సమదారి సంఘంబుఁ
దూలించి వెలయు నంద్యాలవారు
తే. నాదిగాఁ గల్గురాజులు మేదురగతి
తుళువదొరలును బోయలు దురుసుగాఁగఁ
బ్రతిదినంబును ఘోర మారణ మొనర్ప
నిలిచిపోరాడె గజపతిబలము లపుడు. 56

ఉ. శివిగ నాతువారును గడింది రహిన్ వెలుగోటివారలా
రావెలవారు గూడుకొని రాత్రిఁబవల్ చతురంగసేనతో
నేవగఁజూచియుం దెలియనేనియుశక్యము గాని దుర్గమ
భూవరమాళిగాంచి యొకపూఁటనె తీసెననంచునుగ్రుఁడై

ఉ. దిగ్గునలేచి సాహసముతేఁటపడన్ మునుమున్నుగాఁగ
నగ్గలికన్ జెలంగు విధమంతయుఁ గన్గొని రోషచిత్తు
లగ్గల కెక్కిరందఱు బలంబు చలంబలరన్ రవంబు
దిగ్గజముల్ వడంక బలుతెంపునగుంపులుగూడియు

క. తనధాటి కళుకుచుండగ
క్కన దుర్గముడిగ్గి కావుకావనువారిన్
కనుఁగొని యాభూరమణుఁడు
ఘనతర కారుణ్య రసము కడలుకొనంగన్.

తే. జడియకుఁ డటంచు నభయహస్తం బొసంగి
యమ్మహాదుర్గ మహిమకు నే నద్భుతంబు
నొంది యచ్చట నాప్తులనుంచి యవలఁ
జనియె నుద్దండశౌర్యప్రచండుఁ డగుచు. 60

సీ. అట కందుకూరు పెట్టదరె కాహళ శంఖ
భేరీ విరావముల్ బోరుకలఁగ
నావలఁ గొండవీడదరెది కృతటనటత్
సేనారజో వ్రజశ్రీలు వెలయ
మఱి కొండపలిఁ గలంగెరట న్మదేభేంద్ర
ఘంటికాఘణ ఘణంఘణలు చెలఁగ
నామీఁద వినుకొండ యల్లాడె భటసము
ద్భటసింహరవ మహోద్భటులు దనర

తే. వెండియును గల్గుకోటలు వివిధదుర్గ
తతులు తమఁదామె విడిచి కొండలకుఁ జేరి
రచటి గజపతివారి సైన్యాధినాథు
లల నృపాలుని దాడికి నిలువలేక. 61

తే. ఎదురుకాంచనముద్రలు ముద మెలర్పఁ
దెచ్చి వేవేగఁ జేతికం దిచ్చువారు
శరణు వేడుచు సాష్టాంగ మెఱఁగువారు
నైరి యుత్తరమునఁ గల్గునట్టి దొరలు. 62

---

# ఆంధ్రమూషకము.

సీ. సిర్నిద్రవిషయుక్త నిశితదంష్ట్రలఁ బూని
భేదించు నెటువంటి గాదెలైన
దారుణోద్యద్దంత తతిచేత ఖండించు
గుఱుతుగా నెటువంటి కోకలైన
పటుసురంగాగార భరితంబుగాఁ ద్రవ్వుఁ
బొంకాన నెటువంటి భూమి నైన
కీచుకీచు నినాద వాచాపటిమచేత
వర్ణించు నెటువంటి ప్రభువునైన
తే. నతఁడు సామాన్యుఁడే నరేంద్రాలయాంత
రంతరానేక పేటికాక్రాంతవస్తు
హారణసురధాణి యావినాయకుపతాణి
చారుతరమూర్తి మూషకచక్రవర్తి. 1

---

# విజయవిలాసము కృతినిచ్చుట.

వ. (చేమకూర వేంకట కవీంద్రుండును) దంజావురీనాథుఁడగు
రఘునాథ మహీకాంతు ననంతశోభనగుణమ్ములలోనం
గొన్ని తలంచి. 1
క. కావున నే నొనరించిన
యీవిజయవిలాస మనెడి కృతిరత్నంబుఁ
గేవలభక్తినిఁ గానుకఁ
గావించెద నని తలంచి కౌతూహలి నై. 2

వ. ఉన్నయెడ నొక్కనాఁడు. 3

సీ. కుందనంపుఁ బసిండి కుళ్లాయిజగలపైఁ
జొకట్ల నిగనిగల్ చొకళింప
హురుమంజిముత్యాలయంచట్టపైఁ గొప్ప
పతకంపుహారముల్ పరిఢవిల్ల
వెలఁజెప్పరాని కెంపులపంకజము దాడి
పీతాంబరంబుపైఁ బెరిమనెఱప
గబ్బిమన్నెకుమార గండపెండేరంపు
జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప

తే. దొరల మంత్రులఁ గవుల నాదరణసేయు
కరము కంకణకాంతి నకల్గడల నిండ
నిండుకొలువుండెఁ గన్నులపండువుగను
ఠీవి నచ్యుతరఘునాథ భూవరుండు. 4

తే. అట్టు లొడ్డోలగం బున్నయవసరమున
వినయభయసంభ్రమములు నావెంటనంట
ననుఁ గృపాదృష్టిఁ జల్లఁగాఁగనుచు నుండ
సమ్ముఖంబున కరిగి యంజలి ఘటించి. 5

ఉ. శ్రీరసభావముల్ వెలయఁజెప్పిప్రబంధము లెన్నియేనిమీ
పేరిట నంకితంబిడిన బిడ్డలనెందఱఁ బేరు పెట్టిన౯
దీఱునె మీఋణంబయినఁదెచ్చితిఁగానఁ బరిగ్రహింపుమ
య్యా! రఘునాథభూపరసికాగ్రణిమామక కావ్యకన్యక౯.

క. అని విన్నవింపఁ జిత్తము
ననలొత్త బరిగ్రహించి నాపై నింతిం

తనరాని వత్సలత్వము
కనిపింపఁగ హర్షభర వికాసస్వరముఖుఁడై.

తే. కలనయిన మిమ్ముఁగాక కన్యులఁగొలువ నంటి
కృతు లొకరి కీను మీకె యంకితము లంటి
పలికినప్రతిజ్ఞ చెల్లింపవలదె యిట్లు
వాఙ్నియమరూఢి నీయంతవాఁ డికేఁడి ? 8

క. వాసించుఁ గవిత చెప్పిన
వీసర వోవాకట భక్తివిశ్వాసంబుల్
నీసొమ్ములు సామాన్యుఁడ
వే! సూర్యవరప్రసాదివిజ్జగ మెఱుఁగన్. 9

క. ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తువెల్లెడ బెళుకౌ
కృతి వింటి మపారముగా
క్షితిలో నీమార్గ మెవరికిఁ రాదు సుమీ. 10

తే. క్షత్రధర్మమె గద నీకు గలదిమొదలఁ
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముఁగొలిచి
తిపుడు కృతియును జెప్పి మా కింపొనర్చి
తొకటఁగా దన్నిటను బ్రయోజకుఁడ వీవు. 11

తే. అని సుధామధురోక్తుల నాదరించి
మంజులపదార్థభూషణాంబర కదంబ
కరితురంగాదివాహనోత్కరము లిచ్చి
న న్నసాధారణముగ మన్నన యొనర్ప. 12

చ. అభినవభోజరాజ బిరుదాంకుఁడు శ్రీరఘునాథశౌరికిన్
శుభమతి నేలినందులకు సూడిదచేసితి నార మిక్కిలిన్

సభలగణింప మన్ననలొసఁగు ప్రబంధము నింతయు త్రి
ప్రభువను సంకితంబొనరుప్రంగలిగింగద యంచు వేఁడు
ఉ. ఆనతి యిచ్చినా యదిశిఖిలాక్షుర! మెవ్వని నేని మెచ్చి
వానిఁగృతార్థుఁజేయుఁ;బగవాఁడయినన్ శరణంబుచొచ్చి
యానరునేర మెంచక, తనంతటివాని నొనర్చు; నిచ్చిన
యేనుఁగు పాఁడి,యీడుగలదే రఘునాథనృపాలమౌళి
ఉ. ఎందునువిద్యలేమెఱుఁగ రెవ్వ;రెఱింగినఁ గొంతమాత్ర
యాదును సాహితీరసమహత్త్వమెఱుంగ, రెఱింగి రేని
యందమెఱుంగలే రెఱిఁగినప్పటికిన్ వినిమెచ్చి యీఁ
న్నందగునచ్యుతేంద్రరఘునాథవిభుండె ప్రవీణుఁడన్నిట
సీ. సింహాసనముచూట శిథిలమాటలు విని
గట్టిగా నిలుపఁ గంకణముఁగట్టె
కోటిసాక్ష్యులు మీఱఁ గూర్చినధనరాశిఁ
గొల్చువారల కిచ్చెఁ గొల్చువలెనె
తుండీర పాండ్యాది మండలాధిపులపై
దండెత్తి గెలిచె నుద్దండ మహిమ
నేల యీనినయట్లు నిలిచిన వైరులఁ
బంచ బంగాళమై పాఱఁ దఱిమె
తే. గర్వితారాతి మస్తక ఖండ నోత్థ
రక్తధారానుషంగాతి రక్తధార
నిజకృపాణికఁ గావేరి నీటఁ గడిఁగె
నిఖిల గుణశాలి రఘునాథ నృపతిమౌళి.

వ. అట్టి గుణనిధి కభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం
బూనిన విజయవిలాసంబను శృంగార ప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. 17

---

# కృష్ణరాయల పట్టాభిషేకము.

వ. ఇట్లు వీరనరసింహ ధరాఖండలుండు మహేంద్ర వైభవంబున
విద్యానగరం బేలుచు నొక్కనాఁడు. 1

తే. తమరు పెద్దల రీతి కీర్తి తతినిఁ గృష్ణ
రాయ లనుపేరి మత్పుత్ర రత్నమునకుఁ
దనరఁ బట్టంబుగట్టెద ఘనత మీఱ
ననుచు నప్పాజితోన మంత్రనము చేసి. 2

మ. సరసీజాక్షుని సత్కృపాగరిమచే సత్కీర్తి రాజింపఁ గా
ధరణీరక్షణదక్షతన్ వెలయు పుత్రాగ్రిమ్ము రమ్మంచుఁ బం
గరుడాల్మొద్ద మెఱుంగుటుంగరము వేడ్కన్ గృష్ణరాయక్షితీ
శ్వరుహస్తంబుననుంచెభూవరుఁడురాజద్రాజధర్మస్థితిన్. 3

క. సత్రాజిద్ధరణీపతి
మిత్రుఁడు రత్నంబొసంగ మెఱసినరీతిన్
జిత్రముగఁ గృష్ణరాయధ
రిత్రీపతియుంగరంబు శ్రీ నొప్పారెన్. 4

సీ. ప్రణుతింప నతఁడు తోరణగట్టుఁ బరసీమ
లనురీతి నూత్నతోరణము లెసఁగ
రిపులఁ జండించి సత్కృపఁ దత్సుతుల నిల్పు
నట్ల ద్వారములందు ననఁటు లమర

విలిఖించు నతఁడు ది ఽ క్కుల జయస్తంభాళి
నను మాడ్కిఁ జిత్తర్వ ఽ హర్మ్య లలర
వెలయు సిట్లతనికీ ఽ ర్తులు దిక్తటుల నన్ను
సరణి ముత్తెపుమ్రుగ్గు ఽ జగ్గు లమర
తే. నభినవాలంకృతస్ఫూర్తి ఽ నతిశయించె
నప్పురీరత్న మపుడు మ ఽ హాద్భుతముగ
ప్రకటమహిమల శ్రీకృష్ణ ఽ రాయనృపతి
శ్రీకరంబైన పట్టాభి ఽ షేకవేళ.
మ. సరగం దెచ్చిరి భూసురోత్తములు కృఽష్ణాగౌతమీజాహ్న
వరణాసూర్యసుతాకవేరతనయాఽవారాశిముఖ్యాంబువుఁ
గరిమం గాంచనరత్నకుంభతతులం ఽ గారుణ్యవిశ్వాసత
త్పరులై యెంతయుఁ గృష్ణరాయవిలసఽద్రాజ్యాభిషేకార్థమై
తే. శంఖకాహళభేరీప్ర ఽ చండవాద్య
తతరవంబులు భూనభోం ఽ తరము నిండ
బ్రాహ్మణుల్ కృష్ణరాయధ ఽ రావరునకుఁ
జెలఁగి పట్టాభిషేకంబుఁ ఽ జేసి రెలమి.
సీ. చక్కఁ జవిలుకాని ఽ చక్కందనము గల్గి
చొక్కమా నార్వేటి ఽ బుక్కరాజు
సాకల్యముగఁ గీర్తి ఽ సర్వదిక్తటులందుఁ
బ్రాకటస్థితి నించు ఽ నౌకువారు
కంటక రాజన్య ఽ గర్వంబు లడఁగించి
లీలచే మించు నం ఽ ద్యాలవారు
ధాటీనిరాఘాట ఽ ఘోటీహతవిరోధి
కోటులై వెల్గు వె ఽ ల్గోటివారు

తే. చణ్డతరశౌర్యు లగు కురా । సానివారు
బూడహాలివారు మొదలైన । భూమిపతులు
గొలువఁ బట్టాభిషిక్తుఁడై । చెలువు మీఱె
రమ్యగుణపాళి శ్రీకృష్ణ । రాయమౌళి. 8

సీ. అన్నన్న యాతఁడు సిం । హాసనం బెక్కిన
నిభరాజు తాఁగొండ । లెక్కఁదొడఁగె
నయ్యారె యతఁడు ప । ట్టాభిషిక్తుండైన
సింధురాణ్ణేత్రముల్ । చెమ్మగిల్లె
హైసరే యతనిపే । రనినమాత్రముననే
కురుదేశ మేల్రాజు । గుండె లదరె
నోహొహో యతఁడు ఖడ్గ । మొక్కింత ముట్టిన
సకలారిసంఘము । ల్సంచలించె
తే. మాయురే నరసింహకు । మారరామ
చంద్రశౌర్యనితాంతరా । జత్సమాఖ్య
కృష్ణరాయాభిధాన వ । రిష్ఠుఁ డేలు
ధర్మముల్ ధాత్రిలో యథా । ర్థంబు గాఁగ. 9



శా. శ్రీలీలాత్మజ కృష్ణరాయ సమరో । ర్వి న్నీదు వైరిక్షమా
పాలుర్వ్రేఁగి హయాధిరూఢులగుచు న్బాఱ న్వనీశాఖిశా
ఖాలగ్నాయతకేశపాశులయి యూఁగ న్గేకిసల్లొట్టి యు
య్యాలో జొంపములంచుఁ బాడుదురు భిల్లాంభోజపత్రేక్షణల్.

# సూరకవి: గంగాభవాని

---

సీ. బ్రహ్మాండభాండసం పత్తి కుక్షినిఁ గల్గు
పద్మనాభుని పదా బ్జమునఁ బుట్టి
సకలరత్నాకర స్థాన మైయుప్పొంగు
నంబుధీశుని చర ణంబు ద్రొక్కి
పరమ తత్త్వజ్ఞుఁడై పరగు శంతనమహీ
రమణు వామాంక భాగమునఁ జేరి
యఖిలలో కాధీశుఁ డై మించి విహరించు
శివు జటాజూటాగ్ర సీమ నిలిచి

తే. తనరు నీవంటి ధన్యకు త్తమము గాదు
పూసపాటి మహాస్థాన భూమియందుఁ
గాలు ద్రొక్కంగ నోడుఁ జం డాలుఁ డైనఁ
గదలు మిట మాని దివిజగంగా భవాని.

సీ. కృతకాద్రు లాయెనా కీలోగ్రఫణిఫణా
నేకఫూత్కారవ ల్మీకచయము
విరిదోఁట లాయెనా కఱకు కంటకకంట
కాంకుర విస్ఫురి తాగ చయము
పువుఁబాన్పు లాయెనా నవమంజుల శ్వేత
లవణాలవాల మా చవిటినేల
బొమ్మరిండ్లాయెనా భూరి భేకాండజా
ధారమై తనరు కేదారచయము

తే. నీకు విహరింప వసతులై నివ్వటిలెనె ?
చిన్ని పొలములు, పేదల క్షేత్రములకు

ఘాతుకత్వంబు సేయు మహాపురుషులు కలరె ?
కదలు మీట మాని దివిజగంగా భవాని.

—అడిదము సూరకవి.

---

# మహాకవీంద్రులు.

కవితా కన్యకు నలుగురు
కవి జనకుఁడు, భట్టు దాదిగ గణుతింపంగా
నవరసరసికుఁడె పెనిమిటి
యవివేకియె తోడఁబుట్టు గద వేమనృపా ! 1

—చాటువు.

జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థ గౌరవవికాసి తెనుంగభిరమ్యమంతకున్
గనుఁగొనఁ జూత బీజమునకంటెను గోమలపత్రపుష్పశో
భనమృదు పల్లవాభినవ బాలరసాలము సొంపు నింపదే? 2

—శ్రీపర్వతపురాణము.

. పరసన్ భారత కల్పనారతులు శబ్దస్ఫూర్తి సంధింప ని
ర్భరవృత్తిన్ బరమేశపోతఘనులాలంకారముల్గూర్పఁ జూ
పరులైనట్టి పితామహాద్యులు నుతుల్ వాటింపనత్తించు నీ
పరసాంధ్రోక్తివధూటికేను సుమనస్సంపూర్తిఁగావించెదన్.

—వేంకటార్యుఁడు.

. ఈశుచేఁ గాంచి సాహిత్యవిద్య ధరిత్రి
నిల్పినయట్టివాణిని భజించి
శ్లోకార్థమునఁ జంద్రజూటు మెప్పించి యు
ష్ణార్థముల్ గొన్నమల్లాణు నుతించి

గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు
ప్రతిభతోఁ బడసిన బాణుఁ బొగడి
శతకంబు చెప్పి భాస్కరుని మెచ్చఁగఁ జేసి
యురుదేహుఁ డైన మయూరుఁ గొలిచి
తే. భవుని మెప్పించి కన్నులుఁ బడిదెచ్చి
వనిత కిచ్చిన కాళిదాసునకు మ్రొక్కి
హరునివినుతులచే బాసలాడఁ జేసి
నట్టిభట్టుని నన్నయభట్టుఁ దలఁతు.

— పెదపాటి

సీ. శబ్దశాసనకావ్య సంఘట్టనక్రమా
నందితబుధవర్యు నన్న పార్యు
నుభయభాషారచనోన్నిద్రభద్రవ
చోరాజిఁ దిక్కన సోమయాజి
లక్ష్యలక్షణకళాలంకారసౌభాగ్య
సత్కావ్య విన్యాసు శంభుదాసు
ఛందోనిబంధనచాతురీధౌరేయు
వాగ్ధాము వేములవాడభీము
తే. రసికజనపద్మదిననాథు రంగనాథుఁ
బ్రకటకృతికర్మనిస్తంద్రు భాస్కరేంద్రు
నమితరసభావు శ్రీ త్రిపురారిదేవు
సూక్తిమిధాము నాచనసోముఁ దలఁతు.

— ఆంధ్రకవి రామ

సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢవాసనా
సంపత్తి సొంపుపుట్టింప నేర్చు

సీ. అల విన్నకోట పెద్దన లక్షణజ్ఞత
శబ్దశాసనుని శబ్దశుద్ధి
ప్రాబంధిక పరమేశ్వరు నర్థమహిమం బు
భయకవిమిత్రుని పదలలితత
శ్రీనాథు వార్తాప్రసిద్ధి నాచనసోము
భూరికాఠిన్యంబు పోతరాజు
యమకవిధము మల్లయమనీషి చిత్రంబు
పింగళి సూరకవివరు శ్లేష
తే. యాంధ్రకవితాపితామహు నల్లికబిగి
ముక్కు తిమ్మన తేటయు భూషణుని య
లంకృతియు నీకె కలదా తలంప లక్ష
ణకవియప్పయ వేంకటసుకవిచంద్ర. — గణపవరపు వేంకటకవి.
తే. అల్లసానివాని యల్లికబిగిసొంపు
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
పాండురంగవిభుని పదగుంభనంబును
గాకమానిరాయ నీక తగుర. మూర్తికవి.
ఉ. శిష్టకవిత్వవైఖరి విచిత్రత రాఘవపాండవీయము
త్కృష్టముగా రచించి జగదేకనుతు ల్గని ధాత్రిలో నవ
స్రష్టయనంగఁ బద్మభవ సన్నిభుఁడైన మహాకవీశ్వరా
భీష్టతమప్రభావుఁడగు పింగళిసూరకవీంద్రుఁ గొల్చెదన్
— శివరామాభ్యుదయము.
క. చిన్నన్న ద్విపద కెఱుఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱుఁగు౯
మిన్నంది మొరసె నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్. — చాటువు.

క. కాష్ఠలవలె నింటింటను, గాకవులున్నారు; హంసకైవడి భువిలో
శ్రీకామనికెతగు రా, మేకడను డీఁబాలు నీరు । నేర్పఱుపంగన్.
—కామేశ్వరకవి

ఉ. పూర్వకవీంద్రులం గొలుచు । పూని నిప్పటివారిఁ గొల్తుని
ర్గర్వత; నిక్కవీంద్రులు పు । రాణకవీంద్రుల కంటెఁ దక్కువే?
యుర్విని నేఁటివారగుట । యొచ్చెమె నేఁడును దామ్రపర్ణిలోఁ
బూర్వపు ముత్తియంబులను । బోలిన మౌక్తికరాజి లేదొకో?
—జైతరాజు సుమ్మయ.

సీ. సకలవిద్యలయందుఁ । జర్చింపఁ గవిత యు
త్కృష్టమం డ్రది నిత్య । కీర్తికొఱకు
నర్థాప్తికొఱకు నా । వ్యవహారలక్షణం
బెఱిఁగెడుకొఱకు న । నేకవిధము
లగునమంగళముల । హరియించుకొఱకు సు
చిరనిత్యసౌఖ్యసం । సిద్ధికొఱకు
నొనరఁగాంతాసమ్మి । తోపదేశంబునఁ
బ్రీతిమై హితమాచ । రించుకొఱకు
ఆ. నయ్యెఁ గానఁ బెద్ద । లాచరించెద రంచు
నేర్పుకొలఁదిఁ గృతియొ । నర్పఁ బూని
యస్మదీయకృతికి । నధిపతిఁ గావింప
నర్హుఁ డెవ్వఁ డొక్కొ । యని తలంతు. —అనంతామాత్యుఁడు.

ఉ. బాలరసాలసాలనవ । పల్లవకోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁ । గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహ । నాంతరసీమల॥ కందమూల కౌ
ద్దాలికులైననేమి నిజ । దారసుతోదర పోషణార్థమై. 15
—పోతనామాత్యుఁడు.

సీ. హిమాచలముదాఁక నేకచ్ఛత్రంబుగా
భువి యేలె మీ తాత బుద్ధవర్మ
మీ తాత కురియించె మెఱసి మాధవవర్మ
గరిమితోఁ బెజవాడఁ గనకవృష్టి
పాండ్య కేకయ చోళ వరవీర బలములఁ
దెగటార్చె మీ తాత దేవవర్మ
పిడుగుముత్తియముగా వడిచేసె మీ తాత
భీకరంబుగఁ జిక్కి భీమనృపతి
తే. చండవిక్రమ ఘనవంశ జలధిచంద్ర
బాపు నగధీర రణరంగ భైరవాంక
పోసఁగ నెవ్వారు నీసాటి పూనపాటి
రాచవిభుతమ్మ యుద్దండ! రాచమాన.

కాకతీయప్రభువు.

సీ. పూర్వాపరాబ్ధులు పొలిమేరలై యుండ
నేరాజు జగమెల్ల నేలఁ గలిగె
లక్షించఁ దొమ్మిది లక్షల విలుకాండ్రు
రేరాజు బలమందు నెనసి యుండ్రు
ధరణి డెబ్బదియేడు గురునాయకోత్తము
లేరాజు సేవింతు రిచ్చగించి
దాక్షిణాత్యుల నెల్లఁ దఱిమి జయస్తంభ
మేరాజు నిలిపె రామేశ్వరమున
తే. నతఁడు కాకతివీరరుద్రావనీశుఁ
డమ్మహారాజు చెప్పంగ నలరె ధాత్రి

రాజశేఖరుఁ డెంతయు రమణతోడ
జగము పాలించు భూలోక చక్రవర్తి.

అనవేమనృపాలుఁడు.

క. కొంచెపు జగములలోపల
నంచితముగ నీదుకీర్తి యనవేమనృపా!
మించెన్ గరి ముకురంబునఁ,
బంచాక్షరి శివుఁడు, మదిఁ బ్రపంచముఁ బోలెన్.

తే. పందికొమ్మెక్కి పెనుబాము పడగ లెక్కి
మేటి తామేటి వీఁపెక్కి మెట్ట లెక్కి
విసివి వేసారి యనవేము విభునిఁ జేరి
రాణివాసంబుఁ గనఁ గాంచె రత్నగర్భ!

చ. వెలమకులంబునందు నిలువెల్లరు కాంతలటంచుఁ బల్కిన
ప్పలుకు లబద్ధమయ్యెఁ గులపావనుఁడీఘనుఁ డప్పరాయరా
ట్కులభముకీర్తికాంత కృతికాంత మహీజయకాంత యిప్పుడీ
కలియుగమంతటన్ దిరుగఁగాఁ గనుఁగొంటిమి చిత్రమారయన్.

వాసిరెడ్డి వేంకటాద్రిప్రభుఁడు.

తే. వైభవోపేంద్రుఁ డైనట్టి వాసిరెడ్డి
వేంకటాద్రీంద్రుఁ డొకపెండ్లి వేళయందుఁ
బిన్నదొరలకు నత్తరుల్ గొన్నకర్చు
పృథ్విఁ గల రాచవారికిఁ బెండ్లికర్చు!

క. వెన్నెలవలెఁ గర్పూరపుఁ, దిన్నెలవలె నీదుకీర్తి దిగ్దేశములం
దౌన్నత్యంబున వెలసెను, విన్నావా వాసిరెడ్డి వేంకటనృపతీ.

పూసపాటి విజయరామరాజు.

ఉ. రాజు కళంకమూర్తి రతిరాజు శరీరవిహీనుఁ డంబికా

రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతరసీమవర్తి
భ్రాజిత పూసపాడ్విజయరామనృపాలుఁడె రాజుగా
రాజులు రాజులా పెనుతరాజులుగాని ధరాతలంబు

సాళువతిమ్మమంత్రి

చ. కరచరణాదు లందఱకుఁగల్గినయంతట నే సమర్థతన్
నెఱవడిఁ గాంచనేర్తురె మనీషివరుల్ ధరలోన నెవ
్కరణిఘటించుచుంగృతయుగంబునఁ ద్రేతను ద్వాపర
దరయఁగసాళ్వతిమ్మసచివాగ్రణికిన్ సమమంత్రి క

వత్సవాయి తిమ్మజగపతిరావు.

ఉ. తేఁకువతోడి వత్సవయతిమ్మజగత్పతి ప్రాపు సేరితిన్
రాకు దరిద్రమాయెఁక పరాకునశై నగిరాకునైన నీ
పోకలు సాగవింకఁ జెడిపోవక మాపగవాఁడఁ జేరువ
దీఁకొని వచ్చితేని నినుఁ దిట్టక కొట్టక మాన నిమ్మ

మల్కిభరాముకుతుపశాహి.

ఉ. ఏడుకులాద్రులెక్కి వెసనేడు పయోధులు దాఁటి
నేడవుదీవులం దిరిగి యేడుగడన్ విహరించి కీర్తి
ఏడుజగమ్ములన్ వెలయ నేచినమల్కిభరామచం
యేడవ చక్రవర్తిపదు నేడవరాజు ధరాతలమ్మునన్

కృష్ణరాయలు

మ. బలభిన్నాగము చెంపఁగొట్టి గిరిజాప్రాణేశు నత్త్రి
గ్గలజా తేజుణ కొప్పువట్టి శశిరేఖుం జెక్కి ధట్టించి
బలరామున్ మొలఁబట్టి నీయశము భూభాగంబునన్
నోలలనామన్మథ ! కృష్ణరాయ నరపాలా రాజక

చెన్నపురి: ఆర్యభారతీప్రెస్సున ముద్రితము.—19